# గ్రోమోర్ ఎన్-పి-కె 14-3[redacted]14లో

## భాస్వరామ్లము ఎందుచేత హెచ్చు పాళ్లలో వుందో తెలుసా?

### మీరు పండించే వరి, వేరుశెనగ, పప్పు దినుసులు మరియు యితర పైరులు ఆరోగ్యవంతంగా పెరిగి అధిక దిగుబడినిచ్చేందుకు!

22790



వేరుశెనగ, పప్పు దినుసులు, కూరగాయల పైరులు భాస్వరామ్లమును ఎక్కువ మోతాదులలో తీసుకుంటాయి. శ్రేష్ఠమైన గ్రోమోర్ ఎన్-పి-కె 14-35-14 భాస్వరామ్లమును హెచ్చు పాళ్లలో కలిగివుంది. ఇందులోని భాస్వరామ్లము అంతా నీటిలో కరుగుతుంది. కనుక మీరు పండించే ఈ పైర్లు ఎక్కువగా కావలసిన భాస్వరామ్లమును సులభంగా గ్రహిస్తాయి. మరి, వరి తదితర పైర్లకు గ్రోమోర్ ఎన్-పి-కె 14-35-14 దమ్ములోగాని ఆఖరి దుక్కిలోగాని వాడుటకు శ్రేష్ఠమైన ఎరువు.

గ్రోమోర్ ఎన్-పి-కె 14-35-14 భాస్వరామ్లమును ఎక్కువ పాళ్లలో కలిగి వుండటం చేత, భాస్వరామ్లము లోపించిన నేలలలో లేక నత్రజని ఎక్కువ పాళ్లలో వున్న ప్రాంతాల్లో, వరి పైరుకు దమ్ములో వాడేందుకు చాల అనువైనది.

గ్రోమోర్ ఎన్-పి-కె 14-35-14లో పొటాషియం కూడ ఉంది.







| మామూలు రసాయన ఎరువులు వాడితే ఏమి జరుగుతుందో చూడండి : | గ్రోమోర్ ఎరువులు వేసినపుడు ఫలితం చూడండి : |
|---|---|
| నీటిలోని నత్రజనిలో కొంత భాగం మురుగు నీటిలో కొట్టుకొని పోయి వృథా అవుతుంది. భాస్వరామ్లము, నీటిలో కరిగే స్వభావము తక్కువై, పైరుకు తగినంత లభించదు. కనుక మీ పైర్లకు పూర్తి పోషణ అందక దిగుబడులు తగ్గుతాయి. | గ్రోమోర్ లోని నత్రజని అమోనియా రూపంలో లభిస్తుంది కాబట్టి, భూమిలో నిల్వయుండి, పైరు పెరుగుతున్నంత కాలం లభిస్తుంది. భాస్వరామ్లము పూర్తిగా నీటిలో కరుగుతుంది కాబట్టి పైరుకు కావలసిన విధంగా సకాలంలో లభిస్తుంది. దీనివలన పైరుకు పూర్తి పోషణ కల్గుతుంది. |






చేనుకు చేవ,
రైతుకు రొక్కం —
గ్రోమోర్





లోకం పోకడ - ఉమెన్




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
( 1938 1972 )

శుక్రవారం : 4 7-'75

రాక్షసనామ సం జ్యేష్ఠ మాస బ దశమి

సంపుటము . 68 సంచిక . 42

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా - రు 33-80 పై.
ఆరుమాసాల చందా - రు 16-90 పై.
విడిప్రతి వెల 60 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ 520003.

---

## విషయానుక్రమణిక

## మనలో మాట

పోయిన రెండు వారాలుగా మేం లోగడే మనవి చేసినట్లు ముద్రణా యంత్రంలో ఏర్పడ్డ చిన్న మరమ్మతు వల్ల మా పాఠకులకు కలిగిన యిబ్బంది యీ వారంతో పూర్తిగా తొలగిపోయింది.

* * *

సినిమా బొమ్మలు యింకా ఎక్కువ కావాలన్న పాఠకుల కోరిక సాధ్యమైనంతవరకు గుర్తుంచుకొని, వార్తల ఒత్తిడి లేనప్పుడు ఎక్కువగా బొమ్మలు వేస్తూనే వున్నాము.

* * *

'ఈ సంఘంలో కుటుంబమే యిది' రాస్తున్న 'అన్నపూర్ణ' గారి పరిచయం పై వారం 'మనలో మాట' లో యిస్తాము...సీరియల్ కథలు మనకున్న 'శీర్షికల' సంఖ్య ఎక్కువైన దృష్ట్యా యిప్పట్లో రెండు కన్నా ఎక్కువ ఒకేసారి యివ్వగలమా? అని సందేహిస్తున్నాము. అయితే సాధ్యమైనన్ని ఎక్కువ కథలు యివ్వటానికి మా ప్రయత్న లోపం ఎప్పుడూ వుండదు.

* * *

ఉత్తరాలు రాసే పాఠకులు తమ పేర్లు సంతకాలుగా గాక విడి విడిగా రాయటం అవసరం. వారి వారి చిరునామాలు కూడా యివ్వడం మరిచి పోవద్దని మరోసారి మనవి!

## ఉత్తరాలు

### కథలు

5—6—75వ తేది పత్రిక ముఖచిత్రం అత్యంత ఆకర్షణీయంగా ఉన్నది. కథల్లో 'చేయూతం' ఇంటరెస్టింగ్‌గా ఉంది. సీరియల్ ఎక్సెలెంట్. అయితే అన్నపూర్ణగారి సీరియల్ "ఈ సంఘంలో కుటుంబమే యిది" ప్రతి వారం పాఠకులను సస్పెన్సులో ముంచెత్తుతోంది. మరి కార్టూన్స్ ఎక్కువగా ప్రచురించాలని నా అభిలాష. "మంచిని పెంచి చూడు" ముగింపు నచ్చలేదు. కె. రామలక్ష్మి గారి ప్రశ్నావళి భలేగమ్మత్తుగా ఉంది.

కొలగాని దేవి, చిన్ని (బాపట్ల)

(46వ పేజీ చూడండి)

రాయ్‌బరేలీ ఎన్నిక రద్దు: 'స్టే'

# ప్రధాని పదవిలో శ్రీమతి గాంధీ కూడా 'స్టే'

[పీరాజీ]

**కడవంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువైనట్లు జూన్ 12 వుదయం పదిన్నరగంటలకు** అలహాబాద్ హైకోర్ట్ - 1971 మార్చిలో రాయ్‌బెరెల్లీ [యు. పి.] నుంచి లక్షాడెబ్బయి వేల వోట్ల ఆధిక్యతతో లోక్‌సభకు ఎన్నికైన శ్రీమతి యిందిరాగాంధీ - ఎన్నికని నాలుగు సం. ల నలభై రోజుల విచారణ పిదప 258 పేజీల సుదీర్ఘమైన తీర్పు చెప్పి - రద్దు చేసింది. ఆరేళ్ళదాక శ్రీమతి గాంధీ ఏ రకమైన ఎన్నికల్లోను పాల్గొనరాదని ఆంక్ష కూడా విధించిన న్యాయమూర్తి శ్రీ జగ్‌మోహన్‌లాల్‌సిన్హా తీర్పు చెప్పిన అరగంట సేపటికి - దాని అమలు మీద '20 రోజుల వాయిదా,' అప్పీలుకు అవకాశం కూడా మంజూరు చేశారు. దాంతో పొలిటికల్ పండిట్స్ వొస్తుందనుకున్న 'సంక్షోభం' రాలేదుకాని - విచిత్ర మయిన సంకట పరిస్థితి తలఎత్తింది!

### చలించని ప్రధాని

'ప్రధానమంత్రి రాజీనామా చేసే ప్రసక్తి లేదు' హెచ్చరించి. సుప్రీమ్‌కోర్టుకు అప్పీలు చేయటానికి న్యాయవాది ఎన్. ఏ. పాల్కీవాలాగార్ని నియమించింది. ఆమె విచలిత



రాజీనామా ప్రసక్తే లేదు

మైపోలేదు ఆమెమొహం దిగాలుపడ్డట్లుగా వుంటే - దానిక్కారణం గుజరాత్‌లో మొరార్జీ 'వుపవాసాలు' సంస్థాకాంగ్రెస్ 'ఉపన్యాసాలు' పనిచేసి జనం - జనతాఫ్రంట్‌కి వోట్లు వేసేశారే అన్న విచారం - సహచరుడు సమర్థుడూ డి. పి. ధర్ అకాల మృత్యువాత పడ్డాడే అన్న సంతాపం రెండు - అందుక్కారణాలు కావచ్చును!

1971 ఏప్రియల్‌లో శ్రీమతి గాంధీ తనమీద ఎన్నికలో గెల్వటానికి అక్రమ అవినీతి కార్యకలాపాలకు దిగారన్న ఆరోపణలో ప్రజా ప్రతినిధుల చట్టంలోని నిబంధనలను ఉల్లంఘించారనే వాదంతో కోర్టుకెక్కిన సోషలిస్టుపార్టీ నాయకుడు రాజ్‌నారాయణ్, ప్రతిపక్షనాయకు లందరికన్నా ఎంతో ఎత్తుకు ఒక్కసారి ఎదిగిపోయినవాడై తీర్పువింటూనే లడ్డూలు, 'బనారసీ మీఠాపాన్'లు పంచి పెట్టారు.

(42వ పేజీ చూడండి)

లడ్డూలు! కిళ్లీలు!!



# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**ఉద్యోగులకు హెచ్చు జీతాలు :**

ఉద్యోగులకు జీతాలు పెంచి శ్రీ వెంగళరావు మరి ఐదు సంవత్సరాలపాటు రాష్ట్రంలో తమ బలాన్ని పదిలపరచుకొన్నారనడం నిస్సందేహం. శ్రీ వెంగళరావు ముఖ్యమంత్రి కాగానే రాష్ట్రానికి, ముఖ్యంగా ఉద్యోగులకు చాలా లాభాలు కలిగించారు. ఇప్పుడు ఈ లాభంతో వారి కృతజ్ఞతకు మరింత పాత్రులయ్యారు. ఈ కొత్త జీతాల శ్రేణుల వల్ల కనిష్ఠపు జీతం రూ. 165–250, గరిష్ఠశ్రేణి 1675–2125 ఉంటాయి. అంతరాలుకూడా చాలా తగ్గాయనవచ్చు. మూలవేతనంలో కరువుభత్యం చేర్చడం, ఇంటిఅద్దె, సిటీ అలవెన్సు అదనం కావడం మరొక విశేషం.

**జై అధికార భాష :**

బోయాలభాషగా తిరస్కృతమైన తెలుగు అధికారభాషకాగానే తెలుగు మాతృభాష కాని వారిలో. కలిగిన మన : పరివర్తనానికి తార్కాణంగా ఇటీవల జరిగిన ఒక సంఘటనను పేర్కొనవచ్చు. నగరంలోని ప్రముఖ కోటీశ్వరుడు శ్రీ పన్నాలాల్ పిట్టి తన జ్యేష్ఠ పుత్రుడైన శ్రీ బదరీవిశాల్ పిట్టి పుత్రిక చి. సౌ: ఉమ, వివాహ శుభలేఖను తెలుగులో ముద్రించారు.

"14—6—1975 శనివారము గోధూళి సమయంలో జరుప నిశ్చయమైనది. ఈ శుభ కార్యమునకు సా: 7 గం. నుండి గం. 8 ల మధ్య మోతీభవన్, సోమాజీ గూడ, హైదరాబాద్‌కు విచ్చేయవలసినదిగా ప్రార్థిస్తున్నాను" అని శుభలేఖ పత్కాణం.

**పాణిని సంస్కృత స్నాతకోత్తర కళాశాల :**

అష్టాధ్యాయి సరళతర సంస్కృత ప్రచార సభ వారి యాజమాన్యాన నిర్మింపబడనున్న పాణిని సంస్కృత స్నాతకోత్తర కళాశాల భవనాలకు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు జూన్ 9వ తేదీన శంకుస్థాపన చేస్తూ, సంస్కృతాధ్యయనానికి వేదాధ్యయనానికి ప్రభుత్వం సహాయం చేస్తుందని హామీ యివ్వడం చాలా బాగుంది. తెలుగు అధికార భాష అయింది గనుక, వ్యవసాయ న్యాయ పరిపాలన శాఖల పారిభాషిక పదాలు కొత్తగా తయారుచేయవలసి ఉంది. పాశ్చాత్యులు గ్రీకు లాటిన్‌ల సహాయం పొందుతున్నట్టు, మనం సంస్కృత ప్రాకృతాల సహాయం పొందడం ఉచితం. సంస్కృతం ఏ ఒక్కరి భాషా కాదు., ఒక వర్గం భాష అసలే కాదు: సంస్కృతం ప్రచారమైతే వర్ణాశ్రమ ధర్మవ్యవస్థ బలపడుతుందని కొందరికి ఉన్నభావం కేవలం భ్రమ. సంస్కృతాన్ని పూర్వం అభివృద్ధిచేసిన విద్వాంసులు, మంత్రద్రష్టలైన ఋషులు, ఉపనిషద్వ్యాఖ్యాతలు ఎక్కువ మంది అగ్రవర్ణాలవారు కారు. కనుక ప్రభుత్వం ముక్తకంఠంతో సంస్కృతానికి సహాయం చేయడం అవసరం. భారతం, వేదం నవీన దృష్టితో అధ్యయనం చేసిన నాడు ఎక్కువ సత్యాలు ఆవిష్కృతాలవుతాయి. ప్రిన్సిపాల్ పండిత ధర్మానంద్‌జీ ఈ విషయంలో శ్రద్ధ చూపుతారని నా విశ్వాసం. ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించిన రెవెన్యూ శాఖామంత్రి శ్రీ నరసారెడ్డి కూడా ఈ కళాశాలకు ప్రభుత్వం సహాయం చేస్తుందని హామీ యివ్వడము ప్రశంసనీయం.

**రహదార్లలో ప్రమాదాలు :**

జాతీయ రహదార్లలో ప్రమాదాలు నివారించడానికి రవాణామంత్రి శ్రీ చొక్కారావు పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్‌తో సంప్రతించి చర్యలు తీసుకోదలచడం చాలా బాగుంది. నిర్లక్ష్యంగా వాహనాలు నడపడం, ఏదో పోటీలో పాల్గొంటున్నట్టు,

(45 వ పేజీ చూడండి)




సిగరెట్టు తాగుతూ స్నేహితుడితో కులాసాగా కబుర్లు చెబుతూ విజయవాడ రైల్వే ప్లాట్‌ఫారంమీద నిల్చుని వున్నాడు రామారావు. అతని స్నేహితుడు రంగనాథం మద్రాసు వెళ్తున్నాడు.

వెనకనుంచి భుజంమీద చెయ్యి పడటంతో ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాడు రామారావు.

బాగా మాసిపోయిన పైజమా లాల్చీలో వున్న వ్యక్తిని చూసి ముఖం చిట్లించుకున్నాడు రామారావు.

“నేను గుర్తున్నానా?” రామం ముఖంలోకి లోతుగా చూస్తూ ప్రశ్నించాడు ఆవ్యక్తి.

“లేదు.” నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు రామం.

“నా పేరు గోపాలం. ఐదు సంవత్సరాల క్రితం ఇదే ప్లాటుఫారంమీద కలుసుకున్నాం.” రామం కళ్లలోకి గుచ్చి చూశాడు గోపాలం.

రామారావుకు వెన్నెముకలో ఏదో జరజర పాకినట్టయింది. కళ్లలో భయం. అరచేతుల్లో చెమటలు పట్టాయి.

“గుర్తు రాలేదా? ఇంకా చెప్పమన్నారా...” అంటూ ఆగి ముఖంలోకి చూశాడు.

రామారావు తడబడుతూ స్నేహితునివైపు చూశాడు. అతను అక్కడలేడు దూరంగా బుక్‌స్టాల్ దగ్గిర నిల్చుని వున్నాడు.

"మీరు పొరపడి వుంటారు. నేను మిమ్మల్ని ఇంతకు ముందెప్పుడూ చూళ్లేదు." తనలో కలిగిన తడబాటును పైకి కనబడ నీయకుండా అన్నాడు రామం.

"మీ పేరు రామంకదూ? మీలో పెద్ద మార్పేమీ లేదు నాలో చాలా మార్పు వచ్చింది. అందుకే గుర్తించలేదను కుంటాను."

"కాదు...నా పేరు రామం కాదు...వెంకటేశ్వర్లు." అన్నాడు రామం పాఠం అప్ప గించినట్లు.

గోపాలం ఆశ్చర్యంగా రామం కళ్ళలోకి చూశాడు రామం పక్కకు చూడసాగాడు.

"నేనే పొరపడివుంటాను మనిషిని పోలిన మనుషులుంటారు" సాలోచనగా అన్నాడు గోపాలం.

"అవునవును. అప్పుడప్పుడు మనం పొర పాటు పడుతుంటాం" కొంత రిలీఫ్‌గా ఫీల వుతూ అన్నాడు రామం.

గోపాలం అదోలా నవ్వాడు రామం గతుక్కు మన్నాడు.

"బండి రావడానికి చాలా టైం వుంది. కాఫీ తాగుదాం వస్తారా?"

"వద్దు. మీరు తాగండి. ఇప్పుడే నేనూ నా స్నేహితుడూ తాగాం!" అన్నాడు రామం.

"మర్యాదకు పిల్చాను. నాదగ్గర డబ్బులు కూడా లేవులెండి. కాఫీ తాగి వస్తాను." అంటూ గోపాలం రెస్టారెంటులోకి వెళ్లాడు.

అలా వెళ్తున్న గోపాలాన్ని చూస్తూ నిలబడిపోయాడు రామం.

మళ్లీ వస్తాడేమో? తను వెళ్లిపోతే? బండి వచ్చేవరకూ వుండకుండా వెళ్లిపోతే తన స్నేహితుడు ఏమనుకుంటాడూ?

అతను తనను గుర్తు పట్టలేదుగా? భయం ఎందుకూ?

ఎలాంటి వాడు ఎలా అయిపోయాడు? ఎంత ఉత్సాహంగా కన్పించాడు ఆరోజు? నీట్‌గా డ్రెస్ చేసుకొని వున్నాడు. దుర్వ్యస నాలు వున్నాళ్లగతి ఇంతే!

ఆరోజు...ఐదేళ్లనాడు...తను అంతరాత్మ పీకనొక్కి స్మృతి పేటికలో అట్టడుగున గుప్తపరచిన ఆరోజు ... మళ్లీ కళ్లముందు కొచ్చి నవ్వింది.

"ఒరేయ్ రామం! జాగ్రత్తగా! నాలుగు వేలు భద్రంగా తీసికెళ్లి మామయ్యకివ్వు రైల్లో నిద్రపోకు అసలే రోజులు బాగాలేవు" హెచ్చరించాడు తండ్రి గుడివాడ బస్ స్టాండ్‌లో.

రామారావుకు అసలే గుండెలు పీచు పీచు మంటున్నాయ్ అంతడబ్బు దగ్గిర పెట్టు కొని ప్రయాణం చెయ్యాలంటే భయంగా వుంది. తండ్రి హెచ్చరికలు మరీ చిరాకు కలిగించాయ్.

"సరేలే! ఇక నువ్వెళ్లు!" విసుక్కున్నాడు రామం.

"వెళ్తాలే! బస్ రానియ్!"

రామానికి మహా చిరాగ్గా వుంది.

"రైలో జాగ్రత్త..."

"అబబ్బ! ఊరుకోనాన్నా!" అంటూ ఎవరైనా వింటున్నారేమోనని చుట్టూ చూశాడు. ఎవరి గొడవలో వాళ్లున్నారు కొద్ది దూరంలో టిప్‌టాప్‌గా డ్రెస్‌చేసుకున్న ఒక యువకుడు సిగరెట్ తాగుతూ రామం కేసి చూశాడు రామం గతుక్కుమన్నాడు. వాడు తనకేసి ఎందుకు చూస్తున్నట్టు? నాన్న చెప్పడం విన్నాడేమో?

బస్ వచ్చింది రామం బస్ ఎక్కి కూర్చున్నాడు. మరోసారి హెచ్చరించి తండ్రి వెళ్లిపోయాడు. రామం కోటు కిందగా షర్ట్ మీద నుంచి బనీన్ జేబు తడిమి చూసు కున్నాడు.

బనీన్ జేబులో నాలుగువేలు పెట్టి పిన్ను పెట్టుకున్నాడు షర్ట్ మీద నుంచి- ఎత్తుగా కన్పిస్తుందనే భయంతో కోటు వేసుకున్నాడు. అయినా భయంగానే వుంది. జేబులు కత్తిరించే వాళ్ల ప్రావీణ్యత గురించి ఎన్నో కథలు విన్నాడు రామారావు.

"ఎంతదాకా?"

రామం ఉలిక్కిపడ్డాడు. పక్కకుచూశాడు తనపక్కన కూర్చున్న వ్యక్తిని చూసి నీరు కారిపోయాడు వీడు...తనను బస్‌స్టాండులో గమనిస్తూ నిల్చున్నాడు. ఇప్పుడు పక్కన చేరాడు. తన దగ్గిర పెద్దమొత్తం వున్నట్టు వాసన పట్టినట్టే వున్నాడు. నాన్నమరీ? చుట్టూవున్న మనుషుల్ని చూడకుండా ఒకటే హెచ్చరికలు చేశాడు

"మాట్లాడరేం?"

"ఒంగోలు వెళ్ళాలి హైదరాబాద్ మద్రాస్ ఎక్స్‌ప్రెస్‌లో" తీరా నిజం చెప్పి నందుకు తననుతానే తిట్టుకున్నాడు

"నేనూ గూడూరు వెళ్లాలి. పర్వాలేదు తోడుదొరికారు. బోర్ కొట్టకుండా కబుర్లు చెప్పుకోవచ్చు" అన్నాడు ఆవ్యక్తి.

సందేహం లేదు. వీడు తనను వెంబడిస్తు న్నాడు. హే భగవాన్ నన్ను ఈ దుర్మార్గుడి బారినుంచి రక్షించే భారం నీదే అతను ఏదో మాటాడుతూనే వున్నాడు రామం 'ఆఁ ఊఁ' అంటూ యథాలాపంగా కూర్చున్నాడు.

ఇద్దరు బస్ దిగారు.

అతను రిక్షా పిల్చాడు. రామం మరో రిక్షా



పిలుస్తూవుంటే "ఏందుకండీ రెండు రిక్షాలు దండగ! ఎక్కండి!" అన్నాడు ఆవ్యక్తి.

రామం గుండెలు వేగంగా కొట్టుకున్నాయ్. జేబుకత్తిరించే ప్రయత్నంలోనే వున్నాడు. దొంగరాస్కెల్. పైకి ఎంత మర్యాదస్తుడిలా కన్పిస్తున్నాడో!" అనుకుంటూనే రామం రిక్షా ఎక్కాడు.

"మీపేరు?" రిక్షాలో కూర్చుని అడిగాడు ఆవ్యక్తి.

"రామం!"

"నా పేరు గోపాలం!" చెప్పాడు అడక్కుండానే.

దొంగలు నిజమైన పేరు చెప్పరు. వీడి పేరు గోపాలం అయివుండదు దొంగవెధవ దొంగపేరు చెప్పాడు.

"అసలే ఉక్కగా వుంటే ఆకోటెందు కండీ? తీసి పట్టుకోవచ్చుగా?" అన్నాడు గోపాలం.

"అమ్మ రాస్కెల్! జేబుకత్తిరించడానికి కోటు అడ్డంగా వుందా? నాకామాత్రం తెలివితేటలు లేవనుకోకు? నేను చస్తే కోటు విప్పను!" అనుకొని "నాకేం ఉక్కగా లేదు." అన్నాడు రామం.

గోపాలం మెడతిప్పి పక్కన కూర్చుని వున్న రామం ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

"ఎట్లా చూస్తున్నాడో వెధవ తన ప్లాన్‌లో పడలేదని!"

## మంచివాడు

ఇద్దరూ రిక్షా దిగారు. రామం రిక్షాకు సగం ఛార్జీ ఇవ్వబోతే "వుంచండి. వడ్డీతో సహా వసూలు చేసుకుంటాను." అని నవ్వుతూ రిక్షావాడికి డబ్బు ఇచ్చాడు గోపాలం.

రామం శరీరంలో చలి కుదుపు కలిగింది. "వడ్డీతోసహా వసూలు చేసుకుంటాడట. జేబు కొట్టేస్తానని ఎంత ధైర్యంగా చెబుతున్నాడూ?" రామం కోటు కిందగావున్న బనీన్ జేబు తడిమి చూసుకున్నాడు. చేతికి ఎత్తుగా తగిలి రిలీఫ్‌గా నిట్టూర్చాడు.

కౌంటర్ దగ్గిర ఇద్దరూ నిల్చున్నారు. గోపాలం ముందు నిల్చున్నాడు. టికెట్లు కొని "పదండి వెళ్దాం!" అన్నాడు.

"టికెట్?"

"నేను కొన్నాను."

'దొంగవేషాలు! నమ్మకం కలిగించడానికి ప్రయత్నిస్తున్నాడు ఎంతోకాలంగా పరిచయం వున్నట్టు కలేసుకుంటున్నాడు. వాడి టక్కరి ఎత్తులు తనకు అర్థం కావడం లేదనుకున్నాడు.'

కోటు జేబులో వేరుగా పెట్టిన డబ్బులో నుంచి లెక్కచూసి ఇచ్చేశాడు గోపాలం వద్దన్నా వినకుండా.

బండి గంటలేటని తెలిసింది. కనీసం మరో మూడు గంటలయినా స్టేషన్‌లో పడి వుండాలి.

"ఇప్పటినుంచే స్టేషన్‌లో ఏం చేస్తాం? రండి! టీ తాగుదాం" అంటూ గోపాలం స్టేషన్‌కు ఎదురుగావున్న బార్‌లోకి దారి తీశాడు. రామం అయిష్టంగానే అతన్ని అనుసరించాడు.

"ఏంసార్! ఈమధ్య కన్పించడంలేదు?" గోపాలాన్ని బేరర్ నవ్వుతూ పలకరించాడు.

"అవును! చాలా కాలం అయింది. రెండు టీ. స్పెషల్!" అన్నాడు నవ్వుతూ.

రామం ఆలోచనలో పడ్డాడు. ఈ బేరర్ గాడూ వీడూ కలిసి తనను ఏమైనా చేస్తే? ఇంత మంది మధ్య పట్టిగా ఏం చేస్తార్లే!

"సిగరెట్ కాలుస్తారా?"

కాల్చాలని వున్నా "వద్దు!" అన్నాడు రామం. ఎవ్వైనరు నమ్మేది? ఆ సిగరెట్‌లో ఏమత్తు పదార్థమో వున్నా వుండొచ్చు.

బేరర్ టీ తెచ్చి ఇద్దరిముందూ పెట్టాడు. 'స్పెషల్!' అన్నాడు! వాడునవ్వాడు' కోడ్ భాషలా వుంది. తన ముందువున్న కప్పులో తప్పక ఏదో కలిపే వుంటాడు. గోపాలం బేరర్‌తో మాట్లాడుతున్నాడు. సమయం చూసి తన కప్పు గోపాలం ముందు పెట్టి, రెండోది తను తీసుకున్నాడు

"తాగండి! స్పెషల్ టీ!" నవ్వుతూ అన్నాడు గోపాలం.

తను కప్పులు మార్చింది గమనించినట్టు న్నాడు. కాలాంతకుడు.

గోపాలం తన ముందు వున్న కప్పు తీసు కొని టీ తాగుతూవుంటే రామం ఆశ్చర్యంగా చూశాడు.

"పెళ్ళయిందా ?"

"అయింది. ఒక పిల్లవాడు కూడా !", భార్యాబిడ్డల రూపాలు కళ్ళకు కన్పించగా ఉత్సాహంగా అన్నాడు రామం.

"ఉద్యోగం చేస్తున్నారా ?"

"లేదు. బి. ఏ. పాసయ్యాను. వ్యవసాయం చూసుకుంటున్నాను."

"ఒంగోలు పనిమీద వెళ్తున్నారా ?"

"సంతలో ముర్రా బర్రెల్ని కొనడానికి వెళ్తున్నాను" అని చెప్పబోయి మానేశాడు. "పనేంలేదు. మామయ్యకు సుస్తీగా వుంటే చూట్టానికి వెళ్తున్నాను" అన్నాడు.

"మీకు పెళ్ళయిందా?" రామం మొదటి సారిగా ప్రశ్నించాడు గోపాలాన్ని.

"అయింది. ఒక లక్షాధికారి కూతుర్ని లేపుకొచ్చి రిజిష్టర్ మారేజ్ చేసుకున్నాను."

రామం గోపాలం ముఖంలోకి నిరసనగా చూశాడు. ఎంతకైనా తెగించినవాడే! అనుకున్నాడు.

"నేను బ్యాంక్‌లో పని చేస్తున్నాను."

"కొయ్‌రా నాయనా కొయ్" అడక్కుం డానే బ్యాంకులో ఉద్యోగం అని చెప్తున్నాడు. తను ఇలాంటి వేలు ఎన్నో రోజుకు చూస్తా నసీ, డబ్బంటే తనకు లక్ష్యం లేదనీ నన్ను ఇంప్రెస్ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు చిట్టినాయన ! నాకు బొత్తిగా బుర్ర లేదను కుంటున్నాడు !

"ఏమిటి ఆలోచిస్తున్నారు ?".

రామం త్రుళ్ళిపడ్డాడు. చేతిలో వున్న కప్పులో టీ వొలికింది. చెయ్యి చురుక్కు మంది.

"చెమట్లు కారిపోతున్నా ఆ కోటు విప్పరేం ? మిమ్మల్ని చూస్తుంటే నాకు బాధగావుంది." గోపాలం అన్నాడు.

"వుంటుంది! వుంటుంది! ఎందుకుండదూ బాధగా ? నీకు కావల్సింది నేను కోటు విప్పడమేగా ? నేను ఆమాత్రం గ్రహించలేదు అనుకోకు" అనుకున్నాడు. పైకి సమాధానం ఇవ్వలేదు.

"మీకు డింకుతీసుకునే అలవాటుందా?"

"అమ్మ బిడ్డా ! తాగించాలని చూస్తున్నావా ?"

తాగాలని వున్నా "లేదు నాకు అలవాటు లేదు." అబద్ధం ఆడేశాడు రామం.

"మీరు చాలా బుద్ధిమంతుడిలా వున్నారు ?"

"నాకు చెడు అలవాట్లేమీ లేవు." గర్వంగా అన్నాడు రామం.

"నాకు అన్ని చెడుఅలవాట్లూ వున్నాయ్. తాగుతాను. అందుబాటులోవున్న ఆడవాళ్లను వదిలిపెట్టను. నాభార్య పరాయి మగవాడితో తిరుగుతానంటే చస్తే ఒప్పుకోను. మీలా మంచి అలవాట్లతో మనిషి ఎలా జీవిస్తాడో నాకు తెలియదు. గతాన్ని తల్చుకుంటూ, భవిష్యత్తు గురించి ఆలోచిస్తూ బతకలేను. వర్తమానంలో జీవిస్తాను. ప్రతిక్షణం జీవిస్తాను" విస్కీగ్లాసు ఖాళీ చేశాడు.

---

### "పవర్ కట్ !"

దేశంలో రోజుకు 22 కోట్ల 50 లక్షల యూనిట్ల విద్యుఛ్చక్తి అవసరంకాగా ప్రస్తుతం మనకు 19కోట్ల యూనిట్లు మాత్రమే లభిస్తున్నది. అంటే కొరత 3 కోట్ల 50 లక్షల యూనిట్లు. దేశంలో ప్రస్తుతం లభిస్తున్న మొత్తం విద్యుచ్ఛక్తిలో 60 శాతం థర్మల్, అణువిద్యుత్కేంద్రాలలోను, మిగతా 40 శాతం జలవిద్యుత్ కేంద్రాలలోను ఉత్పత్తి అవుతున్నది. 1973—74తో పోల్చిచూస్తే 1974—75 ఆర్థిక సంవత్సరంలో థర్మల్ కేంద్రాల ఉత్పాదన 12 శాతం పెరిగింది. జలవిద్యుత్ కేంద్రాలలో 12 లక్షల కిలోవాట్ల స్థాపక ఉత్పాదనాశక్తి గల బాక్రా కేంద్రం ప్రథమస్థానం ఆక్రమిస్తున్నది. మహారాష్ట్రంలోని కోయినా, టాటా జలవిద్యుత్ కేంద్రం, ఉత్తర ప్రదేశ్‌లోని రిహాండ్, ఒరిస్సాలోని హిరాకుడ్, బలిమెల, ఆంధ్ర ప్రదేశ్‌లోని మాచ్‌కండ్, ఎగువ సీలేరు, మధ్య ప్రదేశ్‌లోని గాంధీసాగర్, జవహర్‌సాగర్, రాణా ప్రతాప్‌సాగర్, కర్ణాటకలోని శరావతి, కేరళలోని శబరిగిరి, తమిళనాడులోని కుండా, మెట్టూర్, పెరియార్, కొడయార్‌లు ఇతర ప్రధాన జల విద్యుత్ కేంద్రాలు.

---

రెండోగ్లాసుకూడా పూర్తి కావస్తోంది. కబుర్లు చెపుతూ, మధ్యమధ్య కూనిరాగం తీస్తూ తాగుతున్నాడు.

ఏమిటి ? ఇంత తాగేస్తున్నాడు ? అంత డబ్బు అతనిదగ్గర వుందా ?

గోపాలం ముఖంలోకి చూశాడు కళ్ళు మత్తుగా వాలిపోతున్నాయ్ ముఖం ఎర్రబడింది.

"ఇదీ ఒకందుకు మంచిదే ? మరోగ్లాసు కొట్టేడంటే గుర్రం ఎక్కేస్తాడు. ఇక వాడిబొంద వాడు నష్టం చేస్తాడు ?" ఆలోచనలో పడ్డాడు రామం.

"నా...నా భార్య ... చాలా ... మంచిది నాకోసం కులం...ధనం అన్నీ వదిలేసుకుంది. నేనేంచేసినా సహిస్తుంది..."

"అబ్బాయిగారిపని సగం అయిపోయింది. మరోగ్లాసు పోయిస్తే సరి !" అనుకుంటూ "మరోగ్లాసు తాగుతారా ? డబ్బుకు వెనకాడకండి నాదగ్గర వుంది ఇస్తాను" అన్నాడు రామం ఉత్సాహంగా.

గోపాలం రామం ముఖంలోకి చూశాడు.

"డబ్బు నా దగ్గరకూడా వుంది. మూడు వేలకు పైనే ఉంది. ఇంత మొత్తం దగ్గర పెట్టుకొని ఇవాళతాగకూడదనే అనుకున్నాను. కాని వుండలేకపోయాను. ఇందులోవున్న హాయి మీకు అర్థంకాదు. మీలాంటి వాళ్లను చూస్తుంటే నాకు జాలి వేస్తుంది. తాగడం వల్ల కొన్ని నష్టాలు కూడా లేకపోలేదు. అప్పుడప్పుడు వాచీ, పెన్, డబ్బూ పోతూ వుంటాయ్."అన్నాడు గోపాలం మూతలు పడి పోతున్న కళ్లను బలవంతంగా తెరుస్తూ.

"వీడు మామూలు దొంగకాదు. గజదొంగ. తెలివైన దొంగ. తన దగ్గర మూడువేలు న్నట్టు నన్ను నమ్మించటానికి ప్రయత్నిస్తున్నాడు. ఒరేయ్! రాస్కెల్. నువ్వు తాగినా తెలివిగానే వున్నావురా ! నాకూ వున్నదిరా తెలివి. పైగా తాగలేదు కూడా !" కసిగా అనుకున్నాడు రామం.

బేరర్ బిల్లు తెచ్చాడు. గోపాలం పర్సు తీసి వందరూపాయల నోటు ఇచ్చాడు.

మొత్తం మీద ఒక వందరూపాయల నోటు వున్నట్టుంది. అది ఎవరి జేబులో నుంచి కొట్టేశాడో !

బేరర్‌కు ఐదురూపాయలు ఇచ్చి గోపాలం లేచినిల్చున్నాడు. తూలి కుర్చీ పట్టుకున్నాడు.

"రామంగారూ ! ఈ పర్సు మీ దగ్గర వుంచండి. ఇందులో చాలా డబ్బువుంది. నేను మత్తులో వున్నాను. వళ్ల తెలియకుండా నిద్ర పోతే ఎవరైనా తీసేస్తారు" అంటూ పర్సు అందించాడు.

రామం పర్సు అందుకున్నాడు. పర్సులావుగానే వుంది.

ఓ క్షణం రామానికి అతని మాటల్లో నిజాయితీ వున్నట్టు అనిపించింది.

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

ఎమ్. వి ఆర్. విశాఖపట్నం

మీ రెవరి సలహాలూ ఎందుకు పాటించరు? మాలతీచందూర్‌లా జవాబివ్వరు. సులోచనా రాణిలా రాయండి అంటే రాయరు. మీకు తల పొగరు చాలా ఎక్కువగా వుంది?

చిత్తం అందరి సలహాలు వింటూ యిట్లా కడితే అది అష్టావక్రుడి అవతారంగా తయారవుతుందని భయం!

ఎమ్. ఎస్. పి పొల్వంచ

ఒక యువకుడు తారసపడ్డాడు. నాకు అతనితో స్నేహం యిష్టం లేదు. కటువుగా చెప్పడానికి యిష్టం లేదు. . .

బాగుంది వరస! యిష్టం లేనిది సూటిగా చెప్పక డొంకతిరుగుడుగా చెప్తే — అపార్థాలకు దారితీస్తుంది

ఎస్ ఎల్ పత్తూరు.

మీ జవాబులను పట్టి చూస్తే స్త్రీ పురుషులు సమానమన్నట్లు చూస్తున్నారని తెలుస్తోంది. కాని మన దేశంలో ఆ సమభావం రావడానికి కనీసం ఎనిమిది శతాబ్దాలేనా జరగాలని పిస్తుంది.

ఎలా కట్టావు యీ లెక్క చిట్టి తల్లీ. . ముందు స్త్రీల కా సమభావం తలెత్తితేగాని— జనంలో తలెత్తదు అందుకే — 'మీ స్థానం మీరు తెలుసుకోండోయ్' అని గొంతు చించుకోడం—

జి జి. డబవోలు

'వ్యక్తిత్వం, ఆత్మాభిమానం' అనే పదాలకు అర్థం సూటిగా చెప్పండి.

వ్యక్తిత్వము ఇన్‌డివిడ్యుయాలిటీ. ఆత్మాభిమానం సెల్ఫ్ రెస్పెక్ట్ యీ సూటి చాలా?!

ఎమ్. సి. పి. కర్నూలు.

ఆమె జవాబులు సాధ్యమైనంత పెద్దవిగా, బొమ్మలతో వుంటాయి. మీవి సూక్ష్మంగా ఎంతో బాగుంటాయి. ఎందుకీ బేధం?

రాస్తున్నది వేర్వేరు దృక్పథాలు కల వ్యక్తులు కనుక! రోగ తీవ్రతకి గుటుక్కున మింగే చేదు మాత్ర కావాలి. శరీరాన్ని అలా పోషించుకుంటూ పోడానికి— సిరపీ టానిక్కులు కావాలి. నాది రోగానికి మందు!

## మంచివాడు

అంతా దొంగవేషం! తను ఆ పర్సు ఎక్కడ పెడ్తాడో చూడాలనే ప్రయత్నం తన జేబుల రహస్యం తెలుసుకోవడానికే ఈ ఎత్తు వేశాడు తను మాత్రం తక్కువ తిన్నాడా ఏం? దీన్ని కోటు జేబులోనే పెట్టుకుంటాడు తనకు వేరే జేబులే లేనట్లు ప్రవర్తిస్తాడు అయినా వాడి బొంద ఇందులో ఏముంటుంది గనక? ఏవో పిచ్చి కాగితాలూ బిల్లులూ వుండివుంటాయి

"ఏమిటి ఆలోచిస్తున్నారు? మీరు ఒంగోలులో దిగిపోయే ముందు నన్ను లేపి ఇచ్చెయ్యండి." అన్నాడు గోపాలం.

రామం పర్సు కోటు జేబులో పెట్టుకున్నాడు

"జాగ్రత్త కోటుజేబులో పెట్టుకున్నారు. షర్ట్‌కు జేబులేదా?" గోపాలం అడిగాడు

"చిక్కావురా బిడ్డా! నేను ముందే అనుకున్నాను నువ్వు నా జేబుల రహస్యం తెలుసుకోవడానికే ఈ పర్సు నాకిచ్చావని" అనుకుంటూ "నా షర్ట్‌కు జేబు లేదండీ!" అన్నాడు ఆ విషయం చెప్పే అవకాశం వచ్చినందుకు రామానికి సంతృప్తిగా వుంది. నిశ్చింతగావుంది.

గోపాలం తడబడుతూనే ప్లాట్‌ఫారం చేరాడు రామం భుజంమీద చెయ్యివేసి రైలుపెట్టెలోకి ఎక్కాడు.

బండి బయలుదేరింది. సీట్లు చాలావరకు ఖాళీగానే ఉన్నాయ్ గోపాలం ఇద్దరు మనుషులు కూర్చోగల స్థలంలో ముడుచుకొని పడుకున్నాడు.

రామానికి పర్సులో ఎంతవుందో చూడాలనే కుతూహలం కలిగింది బాత్‌రూంలోకి వెళ్లి నోట్లు లెక్కపెట్టేడు. రామం ఆశ్చర్యానికి అంతులేదు మూడువేలు వున్నాయ్. హోటల్లో మార్చిన వందరూపాయల్లో మిగిలిన కొన్ని పదిరూపాయల నోట్లు కూడా వున్నాయ్.

రామం తిరిగి సీటు దగ్గరకు వచ్చాడు. గోపాలం మంచి నిద్రలో వున్నాడు నిద్ర నటిస్తున్నాడేమో ననే అనుమానంతో ముఖంలోకి పరీక్షగా చూశాడు.

ఆ ముఖం ఎంతో అమాయకంగా కన్పించింది

చిన్న పిల్లవాడిలా ఇంత నిశ్చింతంగా నిద్రపోతున్న ఇతను దొంగా? కాదు. కాదు... తనే అనవసరంగా భయపడ్డాడు. అతన్ని అనుమానించాడు

అయినా రామం తెల్లవార్లూ కూర్చునే వున్నాడు తెలతెలవారుతుండగా ఒంగోలు స్టేషన్ వచ్చింది.

రామం లేచి నిల్చున్నాడు. బ్యాగ్ తీసుకున్నాడు. ఓ క్షణం హాయిగా నిద్రపోతున్న గోపాలం ముఖంలోకి చూసి దిగిపోయాడు.

"ఆగు!" ప్లాట్‌ఫారంమీద నడుస్తున్న రామం ఉలిక్కిపడి ఆగాడు.

తనను కాదు. ఆరే అతని పర్సు తన దగ్గిరే వుండిపోయిందే? తను మర్చిపోయాడు. బండి ఆగివుంది. వెళ్లి ఇచ్చేస్తే? తను బండి ఎక్కగానే అది కదిలితే? పోనీయ్ తర్వాత పంపించవచ్చులే స్టేషన్ బయటికి నడిచాడు. బండి బయలుదేరింది. చూస్తూ నిల్చున్నాడు.

అతని అడ్రసు తన దగ్గిర లేదుగా? ఎలా పంపించడం? అతను తనని గురించి ఏమనుకుంటాడు? దొంగ అనుకుంటాడేమో? అనుకోనీయ్! తను నిజంగా దొంగతనం చేశాడా ఏమన్నానా? మర్చిపోయాడు! అంతేగా? మనియార్డరుద్వారా పంపాలంటే అతని అడ్రసు లేదాయె

"అబద్దం! నువ్వు మర్చిపోలేదు కావాలనే ఓగేశావ్. నువ్వు దొంగవు. ఘరానా దొంగవు" లోపల ఏదో అరిచింది.

"ఏయ్ నువ్వు నోరుముయ్! నేనేం కావాలని మర్చిపోలేదు. నిజంగా నేను మర్చిపోయాను ఇందులో దొంగతనం ఏముంది? అతనిమీద నాకూ జాలిగానే వుంది. ఇలా జరిగినందుకు బాధగానే వుంది."

బుస్ మని తల ఎత్తిన అంతరాత్మ నెత్తిమీద ఒకటివేసి దాన్ని పడుకోబెట్టాడు రామం.

* * *

మళ్లీ చివ్వున అంతరాత్మ తల ఎత్తి "ఏం? ఆరోజు నన్ను కసిరికొట్టావ్‌గా? నిజంగా మర్చిపోతే ఆ డబ్బు ఇప్పుడు ఇచ్చెయ్!" గట్టిగా అరిచింది.

దీని సిగతరగ ఇదొకటి మధ్యలో. మాటకు ముందు నేను వున్నానంటూ బయలుదేరుతుంది.

"ఏడ్చావ్‌లే నోరు మూసుకో! ఇప్పుడు నాదగ్గిర అంతడబ్బు ఎక్కడుంది?"

"ఇప్పుడు లేకపోతేనేం? అతన్ని ఇంటికి తీసుకెళ్లు రేపు సర్దు."

"మంచిదానివే! రౌడీవేషం వాడూనూ! పక్కా దొంగలా కన్పిస్తున్నాడు."

"నీ కంటేనా?"

**పి. ఎస్. డి. రాజమండ్రి.**

జ్ఞానినని గర్వించడమే జ్ఞానమా?

కాదు. తను తెలివిని దాచుకోల్లేకపోవడమే తెలివికి నిదర్శనం.

**ఎన్. పి. చావర.**

మగవాళ్ళంటే మీ కెందుకండీ అంత కోపం ?

కోపంకాదు—ఉడుక్కునే వాళ్ళని ఏడిపించడం ఎవరికైనా—సరదాగా వుంటుంది కదూ ! ?

**టి. ఎమ్. ఉప్మెడ.**

ఆకలి అంతం ఎప్పుడు?

ఇదివరకు చావు ఆకలి అంతం చేస్తుందని అనుకునే దాన్ని, కాని యిప్పుడా నమ్మకం— తగ్గిపోతోంది. వయస్సు పెరుగుతున్న కొద్దీ "నువ్వు నీ కడుపునపడవా" అంటూ పిల్లల్ని భయపెడుతున్నాను!

**డి. వి. ఆర్. సికింద్రాబాదు.**

తెలిసినవాడంటే ఎవరు?

తెలిసినవాడంటేనా అప్పు చేయతగ్గ చనువు వుండి అప్పివ్వేటంత ధైర్యం—యింకా ఏర్పడనివాడు.

**ఎస్. ఆర్. పి. పలమనేరు.**

మీరెప్పుడూ మగవారిని దూషిస్తూంటారు కదా? యమలోకంలో మీకు శిక్షింపబడే శిక్ష వూహించకలరా ?

కొంపతీసి మీరు చూసివచ్చారేమిటి స్వామీ ?!

**ఎమ్. ఆర్. ఆర్. సికింద్రాబాదు.**

పొగిడే వాళ్ళని ఏమనాలి?

ఏమీ అనకూడదు — పిల్లైతే పడవ్వులివ్వాలి ఎందుకో తెలుసా ?— మన అభిప్రాయాలను బల పరిచే వారే కదా— మనని పొగిడేవాళ్ళు!!

**ఎ. ఎవ్. ఆర్. హుకుంపేట.**

ఈ కాలం విద్యార్థులు డిగ్రీలు పూర్తి చేస్తారు. విజ్ఞానము కోసమా? ఉద్యోగాల కోసమా?

విజ్ఞానం కోసం డిగ్రీ ఎందుకండీ?!. ఉద్యోగాలు వస్తున్నాయేమో, వస్తాయేమో నన్న ఆశతో చదువుకుంటున్నారు. ఉద్యోగం రాకపోతే పోయింది. కట్నాలేనా తెస్తున్నాయని తృప్తి పడుతున్నారు.

**పి. ఎస్. పి. నిర్మల్.**

కొందరాడువారికి గర్వం ఎక్కువగా వుంటుం దెందుకండి ? మీ మగవారికి మాత్రం గర్వం వుండదా అని జవాబివ్వకండి?

ఏం — అంత గర్వించతగ్గ పనులేం చెయ్యడం లేదా మీ మగవాళ్ళు ?!!

---

"నువ్వు నోరు మూస్తావాలేదా ?"

చెవులు గింగురుమనేలా నవ్వింది అంతరాత్మ.

"ఏమిటా పిచ్చినవ్వు ?"

"దొంగ మంచివాణ్ణి దొంగ అంటుంటేనూ..." మళ్ళీ నవ్వు.

"నేను దొంగనా ? వాడు మంచివాడా" ఎవరైనా వింటే నవ్వి పోతారు !"

"అవును ! లోకందృష్టిలో నువ్వు మంచివాడివే. నీకు చాలా మంచిపేరు వుంది. పరస్త్రీలను కన్నెత్తి (దొంగచూపులు తప్ప) చూడవు. పడిసుండితో (రహస్యంగా తప్ప) తాగవు. చాలా మంచివాడివి. ఎవరూ తెలుసుకో లేరనుకుంటే తప్ప దొంగతనం, లంకుతనం చెయ్యవు."

"నువ్వు నోరు మూసుకుంటావా లేక గొంతు పిసకమంటావా ?"

"నాగొంతు నలిపెయ్! ఊపిరాడటంలేదు. నాకెందుకులే ! నీయిష్టం వచ్చినట్టే చెయ్ !"

"అలాగా దారికి ! మాటకు ముందు నేనున్నానంటూ బయలుదేరకు జాగ్రత్త !"

"ఏరా రామం ! ఒంట్లో బాగాలేదా ? వళ్ళంతా చెమటలు పట్టిందేం ?" రామం స్నేహితుడు ప్రశ్నించాడు.

రామం ఉల్లిపడ్డాడు. "ఏదోరా కొంచెం గిద్దీగావుంది." అంటూ కర్చీఫుతో ముఖం తుడుచుకో సాగాడు.

"వీరేనా మీ స్నేహితులు మద్రాసు వెళ్తుంది ?"

"మళ్లీ తగలడ్డావ్ ?" అనుకున్నాడు రామం. "అవును" అని సమాధానం చెప్పాడు.

"ఇతనెవరు ?" పైనుంచి కిందకు శల్యపరీక్ష చేస్తూ అడిగాడు రామం స్నేహితుడు.

"నాపేరు గోపాలం. ఒకప్పుడు బ్యాంకులో పనిచేసేవాణ్ణి."

"మరి ఇప్పుడో ?" రామం స్నేహితుడు అడిగాడు.

"నా వేషం కన్పించడంలా ఇప్పుడు నిరుద్యోగిని. ఉద్యోగం పోయింది."

"ఏం ఏంచేశావ్ ?"

ఏకవచన ప్రయోగానికి ఆశ్చర్యపోతూ ఓ నిముషం అతని ముఖంలోకి చూశాడు గోపాలం.

"క్యాష్ మూడువేలు పోయింది. ఇక్కడే, ఈ విజయవాడ నుంచి ఇదే బండి కోసం ఎదురుచూస్తూ పోగొట్టుకున్నాను. ఆరోజే ఇన్‌స్పెక్షన్ జరిగింది. నా డబ్బు తెచ్చి పెట్టే సమయం కూడా లేకపోయింది. మా బాస్ నోరుపారేసుకున్నాడు. కోపంతో నాలుగు తగిలించాను. ఉద్యోగం పోయింది. జైలుకు కూడా వెళ్ళాను. తిరిగి వచ్చేటప్పటికి నాభార్య పుట్టింటికి వెళ్ళిపోయింది. దొంగతో కాపరం చెయ్యనని డైవోర్సుకు కోర్టుకు వెళ్ళింది." నవ్వుతూ చెప్పాడు గోపాలం.

రామం ముఖంలోకి చూశాడు.

"మీకు ఒంట్లో బాగా లేనట్టుంది. కాసేపు కూర్చోండి" అన్నాడు గోపాలం.

"అబ్బే ! నాకేంలేదు బాగానేవుంది." నంగి నంగిగా అన్నాడు రామం.

"ఇంకానయమే అతను నన్ను గుర్తుపట్టలేదు గుర్తు పడితే ఏం చేసేవాడో ?"

రామం లో లోపల వణికిపోతున్నాడు.

బండి వచ్చింది. రామం స్నేహితుడు ఎక్కాడు. బండి కదలబోయేముందు రామం భుజంమీద చెయ్యివేసి "వస్తానండీ రామం గారూ!" అన్నాడు గోపాలం.

రామం అదిరిపడి గోపాలం ముఖంలోకి చూశాడు. గోపాలం కదులుతున్నబండి ఎక్కి డోర్ దగ్గర నిలబడి నవ్వుతూ చెయ్యిఊపాడు.

రామం అప్రయత్నంగా రెండు చేతులూ జోడించి నమస్కరించాడు.



# ఈ సంఘంలో కుటుంబమే ఇది!

అన్నపూర్ణ

(గత సంచిక తరువాయి)

"ఆ రంగ డెవరండీ?... శాంతను కొట్టటం ఏమిటి?"— అంతా అయోమయంగా ఉంది కామేశ్వరికి.

"ఆ శాంతవేది బజార్లో దొరికే విలాస వస్తువు కాముడూ! ... దాన్ని అనుభవించే హక్కు అందరికీ ఉంది ... కానీ, మన రాము దాన్ని ఎవరికీ దక్కనివ్వటం లేదు ... తలకు మించిన పనినా — ఆ పాపిదాన్ని ఉద్ధరించి ఉట్టి కెత్తాలని చూస్తున్నాడు...ఆ శాంతను గురించి లక్కడ ఎన్నో క్రోధాలు, కక్షలు ... ఏ జెప్పుడో దాన్ని గురించి బలైపోతాడు ... తప్పదు ..." — పెద్దకొడుకు భవితవ్యాన్ని గురించి జోస్యం చెప్పాడు గోపాలరావు.

"ఇప్పుడు వీడు వెళ్ళాడు ... అక్కడ ఏం జరుగుతుందోనండీ..."

"నువ్వు,నేను తల మొత్తుకోవటమేగానీ, అక్కడ జరిగేది జరిగిపోతుంది..."

"ఒకసారి మీరు వెళ్ళండీ..."

గోపాలరావుకూ అలాగే ఉంది. ఎంతవెళ్ళా

"అలాగే వెళ్ళి వస్తాను కాముడూ" అని బయలుదేరాడు గోపాలరావు.

అతడు నడిచి వెళ్తే ఆలస్యమవుతుందని రిక్షాలోనే వెళ్ళాడు

అయితే గోపాలరావు అక్కడకు చేరేటప్పటికే జరగవలసింది జరిగిపోతోంది.

తన కన్నకొడుకు రాముణ్ణి ఆ రంగడు కత్తితో పొడవటం స్వయంగా చూశాడు ఆ తండ్రి.

అంతటితో అతడి కళ్ళు బైర్లుకమ్మాయి. ముచ్చెమటలుపోసి స్పృహతప్పినంతపనైంది.

"రామూ!... బాబూ!..." అంటూ బిగ్గరగా అరుస్తూ రిక్షాలోంచిదిగి పిచ్చివాడిలా పరుగెత్తుకువెళ్ళాడురాముపడిపోయినచోటుకు.

రక్తపు మడుగులో గిలగిల కొట్టుకుంటున్నాడు రాము.

ఇంతలో పోలీసు వ్యాను వచ్చింది.

కత్తిపోట్లకు గురైన రాము ఇంకా ప్రాణాలతో ఉన్నాడు కానీ, శాంత అప్పటికే చచ్చిపోయింది.

ఎలాగో శాంత చచ్చిపోయింది...ఇక రాము బ్రతికితే తను అదృష్టవంతుడే. ఆ పాపిష్టిదాన్ని మరిచిపోయి తమ మాట ప్రకారం నడుచుకోగలడు వాడు ముందు ముందు...కనికరించు భగవంతుడా!...వా బిడ్డను బ్రతికించు. గోపాలరావు అంతరాత్మ ఘోషిస్తున్నది.

హంతకుడు రంగడు దొరికాడు. అతడితో పాటు రాముడు, శాంతలను కొంతమంది ప్రత్యక్ష సాక్షులను కూడా వ్యానులో ఎక్కించుకొని తీసుకు వెళ్ళారు పోలీసులు స్టేషన్‌కు. వాళ్ళలో గోపాలరావూ ఉన్నాడు.

రాముడికి సంబంధించిన వివరాలు, తను గొడవ జరిగిన ప్రదేశంలో కళ్ళతో చూసింది అంతా చెప్పాడు గోపాలరావు పోలీసులకు. అతణ్ణి వదిలేశారు. రాముణ్ణి ఆసుపత్రిలో చేర్చారు. శాంత మృతదేహాన్ని శవపరీక్షకు పంపారు.

తన కూతురు శాంతే. అలాంటిది అది ఆ రాముడి వలలో పడి ప్రేమ గీమ అంటూ సంసార పక్షంగా ఉండాలని చూస్తోంది. దాని మీద ఎన్నో ఆశలు పెట్టుకొని ఉన్న కన్నతల్లి తన విషయమే పట్టించుకోవటం లేదిది... అసలు ఇంత జరగటానికి కారకుడు ఆ రామిగాడే...వాడిది పరాయి కులం... ఈ పేట పేటంతా తన కులపు వాళ్ళే...అవసరమొస్తే తన వైపే మాట్లాడతారు అంతా. వృత్తి ధర్మాన్ని ఎవరు కాదంటారు...అలా అనే తన నమ్మినబంటు అయిన రంగణ్ణి ప్రతి సారీ తాగించి కూతురి ఇంటిమీదికి పంపుతోంది. ఇలా వీడు వెళ్తే ఆ రామిగాడి సత్తా ఏమిటో తెలిసి పోతుంది కూడా...అయితే రంగడు రాజమ్మ చెప్పింది వదిలి వచ్చినప్పుడల్లా శాంతను బలాత్కారం చెయ్యబోవటం అది వీలుపడక వెళ్ళిపోవటం జరుగుతోంది. తప్పితే ఆమెను తనతో రమ్మనమని అనటంలేదు. ఇది పనికాదు అని రాజమ్మ ఈ వేళ పూటుగా త్రాగించి 'పసా పైసా తేల్చేసుకురారా రంగా' అంది. 'అలాగేలేవే అప్పా'అని వచ్చి తన శాయశక్తులా ప్రయత్నించాడు. కానీ, శాంత ప్రతిఘటించి నిలబడింది ఒక సమయంలో గత్యంతరంలేక మూలనున్న బడితెతీసుకొని వాడి నెత్తిమీద వేసింది. అసలే త్రాగి ఉన్న రంగడు దాంతో రెచ్చిపోయి కత్తితీసి పొడిచాడామెను. (ఆ యింట్లో గొడవ ప్రారంభమవటం గమనించగానే శాంతమీద అభిమానమున్న కుర్రవాడు రాముడు కోసం వెళ్ళాడు)...ఈ లోగా రాముడు వచ్చాడు. ఇద్దరూ కాసేపు పెనుగులాడుకున్నారు ...చివరకు రాముడు రంగడి కత్తిపోట్లకు గురయ్యాడు.

"ఎంత డబ్బైనా ఫరవాలేదు. మా బిడ్డను మాకు దక్కించండి" అ. ఆ తల్లీ తండ్రీ ఒకటికి పదిసార్లు అన్నారు డాక్టర్లతో.

"డబ్బు సమస్య కాదు... అతని ప్రాణాలు కాపాడటం మా విధి" అన్నారు డాక్టర్లు.

అందరు అన్నివిధాల ప్రయత్నాలు చేశారు కానీ, రాముకు స్పృహవచ్చి తన వాళ్ళతో మాట్లాడకుండానే కన్నుమూశాడు.

* * *

ఒకపూట లేచి ఒకపూట లేవటంలేదు కామేశ్వరి ఇప్పుడు. ఇంటి పనులు వంట పనులు తనే చూస్తోంది శ్యామల. వాకిట్లో వాలుకుర్చీలో కూర్చొని ఎప్పుడూ ఆలోచిస్తూ శూన్యంలోకి చూస్తూండటమే గోపాలరావు పని.

జరిగిన ఘోరం విని ఆఫీసు మిత్రులు కోదండం, రాజారావు, మాధవరావులు సహో

**జరిగిన కథ: 7** గోపాలరావు కామేశ్వరిల సంతానం రాము, కృష్ణ, శ్యామల, మధులు. స్నేహితుల ప్రవర్తన వల్ల పేకాట మానుకుంటాడు గోపాలరావు. తన బాధ్యతా రహితమైన ప్రవర్తన వల్లే పిల్లలు పెడత్రోవ పట్టారని గ్రహిస్తాడు గోపాలరావు. తండ్రితో ఘర్షణపడి ఇంట్లోంచి వెళ్ళిపోయిన రాముడు పాత పుస్తకాల షాపు పెట్టుకుంటాడు. శ్యామలని పెళ్ళి చేసుకోవటానికి ప్రకాష్ అంగీకారం తెల్పుతాడు. తాను విప్లవవాదులతో కలిసి తిరగడం మానలేనని తండ్రికి తెలియచేస్తాడుకృష్ణ. రాము శాంత అనే సానిదాన్ని సర్వస్వంగా నమ్ముకున్నందుకు విచారిస్తాడు గోపాలరావు. ప్రకాష్ తండ్రి సుందరరావు వచ్చి శ్యామలకి వేరే సంబంధం చూసుకోమని చెప్తాడు. మధు ఇంట్లోంచి పారిపోతాడు. దోపిడీ, హత్యానేరాలపై కృష్ణను అరెస్టు చేస్తారు. ప్రకాష్‌తో శ్యామల పెళ్లికి అంగీకరిస్తారు సుందరరావుగారు.

రాము పెద్దబిడ్డ... కృష్ణ అలా అయ్యాడు. మధు ఎటో వెళ్ళిపోయాడు ... ఇక కృష్ణ ముందు తిరగవలసింది వాడే ... ఇప్పుడు అక్కడ ఏం జరుగుతుందో? ... నా దేవుడు తాడో ... తను వెళ్ళటం మంచిదేనా? ... అవసరమైతే పరిస్థితి విషమించకుండా పోలీసులను పిలిపించవచ్చు ...

గోపాలరావు ఇంటికి వెళ్ళి భార్యను, కూతుర్ని తీసుకువచ్చి ఆసుపత్రిలో స్పృహ లేకుండా బెడ్ మీద ఉన్న రాముణ్ణి చూపించాడు.

ఇక ఆ తల్లి రోదన, ఆ చెల్లి దుఃఖం వర్ణించినా మాత్రం తీరతాయా?

అసలు విషయంలోకి వస్తే ఆ తగాదాకు మూలకారణాలు శాంత తల్లి రాజమ్మ. ఒయలు హొయలు వెళ్ళ బొయ్యటానికి తన బైక్ అయిపోయింది. తరువాత నాలుగు తన్నులు వచ్చి సుఖంగా ప్రతతాలంకే అందుకు ఆధారం



వచ్చి తలోరీతిగా తమ తమ సానుభూతి తెలియజేసి వెళ్లారు, మరి ప్రకాష్ ఇంటివాళ్లె వరూ రాలేదు...తన కుటుంబ చరిత్రంతా పేపర్లలోకి ఎక్కిందే?... ఆమాత్రం తెలియకుండా ఉంటుందా వాళ్లకు? ... తెలిసీ కనీసం పలకరించటానికైనా రాలేదు ... తమ యింటి సంగతులు తెలిసి అసలు వాళ్ల మనసులు ఏ విధంగా మారాయో? ... మగబిడ్డలలా — ఎన్నో ఆశలు పెట్టుకొనున్న కూతురి భవిష్యత్తు అధోగతిగా మారదు కదా?...అలా మారిన నాడు కాముడు కాదు— ముందు తనే ప్రాణాలతో నిలవడు ... ఈ విషయంలో ఏం చేస్తాడో భగవంతుడు? — ఇదో దిగులు అతడిలో.

పరిస్థితి ఇలా ఉండగానే ఓరోజు ప్రకాషే స్వయంగా వచ్చాడు.

కాబోయే ఇంటిఅల్లుడుగా భావించి తన కష్టసుఖాలన్నీ అతడికి చెప్పకున్నాడు గోపాలరావు.

అందుకు తన పూర్తి సానుభూతిని ప్రకటించాడు ప్రకాష్. ఆ వెంట ఆలస్యం చెయ్యకుండా తన మనసులోని మాటనూ చెప్పేశాడు అతడు.

"నేను మీ అమ్మాయిని చేసుకోబోవటం లేదు"

ఈ మాట అంటున్నది ప్రకాషే!— గోపాలరావు గుండె బరువెక్కుతోంది.

"మీ అమ్మాయి మీద నాకు విద్వేషం లేదు ... అయితే సంఘంలో గౌరవంగా బ్రతకాలనుకొంటున్నాను ... శ్యామలను నేను చేసుకున్నా రేపు ఆమెను 'ఫలానివారి అమ్మాయి ... వాళ్ల కుటుంబ పరిస్థితులివి' అని నలుగురూ ఆడిపోసుకుంటారు. అప్పుడు

# ఈ సంఘంలో కుటుంబమే ఇది!

నాకు తలవంపులు కాకతప్పదు ... పుట్టబోయే మా సంతతి మీద కూడా ఈనాటి సంఘటనల ప్రభావం పడకమానదు. వాళ్ల భవిష్యత్తుతో సహా అన్నీ ఇప్పుడే ఆలోచించాలి ..." — ప్రకాష్ తన మనసులోని మాటలను బయటపెట్టాడు.

"శ్యామల మా కూతురిగా పుట్టటం — ఇది దాని పాలిట శాపం కాకూడదు బాబూ... అది నీ మీద ఎన్నో ఆశలు పెట్టుకొంది ... దాన్ని నువ్వు చేసుకుతీరాలి... ఇందుకు మరో మార్గం ఏదైనా ఉంటే సూచించు ... మేం అలాగే నడుచుకుంటాం..." అన్నాడు గోపాలరావు — దాదాపు అతడి చేతులు జోడించినట్లుగానే ఉన్నాయ్.

ప్రకాష్ ఏదో ఆలోచనలో పడ్డాడు.

"శ్యామల ఈ గోపాలరావు కూతురు కాదనుకో ... నలుగురు అడిగినా అలా అని అబద్ధం చెప్పు ... దాన్ని గుట్టుచప్పుడు కాకుండా పెళ్లి చేసేసుకో ... నీకు పరువు తక్కువగా ఉంటుందంటే పెళ్లయింతర్వాత మీ యింటికే రాం ... ఈ వూళ్లో ఉండొద్దంటే మరే వూరయినా ట్రాన్స్‌ఫర్ చేయించుకొని వెళ్లిపోతాను ... మగబిడ్డల విషయంలో ఆ దేవుడు నన్నెలాగో వంచించాడు ... ఇక ఆడపిల్ల విషయంలో నీవు, మీ నాన్నగారు నా పాలిట దైవస్వరూపులు. దాని భవిష్యత్తుకే లోపం రాదు అన్న గుండె ధైర్యంతో ఉన్నాను ... ఇక ఆ ధైర్యం కూడా సడలిపోతే నేను మరెన్నో రోజులు బ్రతుకను..." — గోపాలరావుది దుఃఖస్వరం — దీనాలాపన అయింది.

'మీరు ఆ నిబంధనలకు కట్టుబడిఉంటామని మాటయిస్తే శ్యామలను తప్పక చేసుకుంటాను ... నా యిష్టాన్ని మా నాన్నగారు కాదనరు ఇప్పటికీను ..."

— ప్రకాష్‌వి అమృతవాక్కులుగా తోచాయి గోపాలరావుకు.

"చాలు బాబూ...చాలు ... ఈమాత్రం ధైర్యం యిచ్చావు ... నా కంతే చాలు ..." అన్నాడు.

అయితే శ్యామల, "మిమ్మల్ని చూడకుండా నేనెక్కువ రోజులుఉండలేను నాన్నగారూ ... ఇంట్లో నేను గూడా కనిపించకపోతే అమ్మ పరిస్థితి ఎంత దారుణంగా మారుతుందో ఆలోచించండి ... అసలు నాకు ప్రస్తుతం పెళ్లిచేసుకోవాలని లేదు" అంది ప్రకాష్ ముందే.

"అలా అనకమ్మా ... ఇంటి సంగతులన్నీ నేను చూసుకుంటాను ... ప్రకాష్ ఉత్తముడు. పెళ్లి చేసుకొని అతడు చెప్పినట్లు నడుచుకో..." అన్నాడు గోపాలరావు. అతడి కళ్ళు 'ప్రకాష్ ముందే నువ్విలా మాట్లాడటం బాగుండలేదు' అన్న భావాన్ని విప్పి చెబుతున్నాయి కూతురికి.

శ్యామల ముఖంలోకి చూడలేక తల వంచుకొని ఉన్నాడు ప్రకాష్.

"ఆయన నిజంగా నన్ను ప్రేమించిఉంటే అసలు మా వివాహానికి ఇన్ని అడ్డంకులు వచ్చేవే కాదు నాన్నగారూ..." అంది శ్యామల రోషం పట్టలేక.

తోకతొక్కిన త్రాచులా తల పైకెత్తాడు ప్రకాష్.

"మీరు వాళ్ల గడపత్రొక్కటం పరువు తక్కువయినప్పుడు మీ బిడ్డనైన నేను మాత్రం ఆ గడప ఎలా తొక్కుతాను? ... మనం కావాలని ఏం జరిపించలేదు. విధివశంగా జరిగిపోయినయ్ అన్నీ ... అందుకు బాధ్యులు మీరంటున్నాడు ప్రకాష్ ... అయినా ఇన్ని నిబంధనలు, కట్టుబాట్ల మధ్య పెళ్లి చేసుకొని నేను మనశ్శాంతిగా బ్రతకలేను నాన్నగారూ ... నేనే మీకంత భారంగా తోస్తే, నన్ను కాలేజీకి వెళ్లనివ్వండి ... ఒక యేడాది తర్వాత ఏదైనా ఉద్యోగం చూసుకొని నా బ్రతుకు నేను బ్రతుకుతాను..."

[ఇంకా వుంది]



# డాక్టరు సలహాలు

## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**ఆర్. ఎస్. ఆర్. కలకత్తా**

'రెటినల్ డిటాచ్‌మెంట్' ఎందువల్ల అవుతుంది. దానికి ఎక్కడ వైద్య వసతులు ఉన్నాయి.

'రెటీనా' అనే కంటిలోపలి ఛాయా గ్రాహక పొర, ప్రత్యేకంగా మిగిలిన పొరలనుంచి విడదీయబడటం చాలా కారణాలవల్ల జరుగవచ్చును. దృష్టి లోపం, కంటి లోపలి పొరలలో ఒకటైన 'కొరాయిడ్' వాయటం మొదలయినవి ముఖ్యకారణాలు.

దీనికి "ఫోటో కొయాగులేషన్" ద్వారా చికిత్స చేస్తారు. ఈ పద్ధతి ప్రస్తుతం మద్రాసులోని 'వాలంటరీ హెల్త్ సర్వీసెస్‌లోను, లక్నోలోను, ప్రత్యేక నిపుణుల ద్వారా అవలంభింప బడుచున్నది.

**కె. ఎస్. ఆర్ — వైజాగ్**

నా వయస్సు 29 స. లు. నాకు మూతికి గడ్డానికి పొడవుపాటి రోమాలు 6 సం.ల నుండి వున్నవి. నేను చాలా సిగ్గుతో బాధ పడుతున్నాను. ఈ రోమాలు పూర్తిగా నశించుటకు ఏదైనావుంటే వుపచో తెలియజేయండి.

ఈ లక్షణాలను వ్యక్తం చేస్తూ అడపా దడపా ఉత్తరాలు రావటం జరుగుతున్నది. కొన్ని నిజంగా ఆమెకు— రోత, సిగ్గు పుట్టించేవి అయితే ఎక్కువగా అనవసరపు ఆందోళన మాత్రమే పని—ఉత్తరాలను అనుసరించి, నేను వ్యక్తిగతంగా చూసిన (పరీక్షించిన) వ్యక్తులను అనుసరించి తెలుస్తున్నది.

రోమాలనేవి ప్రతివ్యక్తికీ (స్త్రీ పురుషుల కిద్దరికీ) అన్ని వేళలా చర్మంలో ఉండటం ప్రకృతి సిద్ధమని తెలుసుకొనటం చాలా అవసరం. వెంట్రుకలు ఎక్కువగా ఉన్నాయనే అపోహ యవ్వనంలో అడుగిడేవారికి వారు అందానికి బాహ్యంగా నలుగురికీ వచ్చేలా కనబడాలనే ఆతృతతో వీటిని తీసివేయటం ద్వారా ఇంకా ఎక్కువ అవుతాయి. మిగతా వారికి స్త్రీ పురుషహార్మోనులు తారుమారయి పురుషుల హార్మోనులు ఎక్కువ అవటం వల్ల ఇలా జరుగుతుంది. దీనికి స్త్రీ సహజమయిన 'ఈస్ట్రొజెన్' హార్మోన్లు వైద్య పర్యవేక్షణలో వాడటం ఉత్తమం. రోమాలను తీసివేయటం (వ్యావహారికంగా పెరికివేయటం) ద్వారా పరిస్థితి మరింత అధ్వాన్నమవుతుంది.

**ఎమ్. ఎస్ —విజయవాడ**

మాకు ఏడవ నెలలోనే బాబు ప్రాణము లేకుండా పుట్టాడు. అతని తల భాగము అణచి వేయబడినట్లు మెడవద్ద నరములు బయటికి కన్పించాయి. ఇటువంటివి ఎందుకు జరుగుతాయి? ముందు ముందు కూడా ఇట్లాగే జరుగుతాయా?

స్త్రీ—పురుష సంయోగం తర్వాత, వారి జీవాణువుల— మిశ్రమం జరిగిన సమయం నుంచి, శిశువు జన్మించేదాకా, ప్రతి క్షణం జరిగే కొన్ని వేల రసాయనిక, భవుతిక మార్పుల వేగాన్ని తెలుసుకొంటే— మనమందరం ఎందుకు అంగ వైకల్యం లేకుండా పుట్టామో అనే ప్రశ్న తప్పక ఉదయిస్తుంది. ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్‌లో మాత్రమే కనబడే 'జీన్స్' అనే జీవకణాలలోని పరమాణువులు, రెండు వరుసలలో కొన్ని అమైనోయాసిడ్ల పరంపరలను కలిగి ఉంటాయి. వీటికి కొన్ని—నిర్ణయింపబడిన స్థానాలు ఉంటాయి. పొరపాటున ఒక అమైనోయాసిడ్, ఇంకొకదాని స్థానం లోనికి వెళితే— శరీరంలో కొన్ని మార్పులు వస్తాయి. పైన మీరు వ్రాసినదికూడా ఈ తెగకు జెందినదే. ప్రతిసారీ ఇలా అవుతుందని ఆందోళన చెందటం అనవసరం.

సీరియల్

# యుగసంధి

'విరాజి'

3

(గత సంచిక తరువాయి)

కలకత్తాలో హౌరా స్టేషను చాలా హడావుడిగా వుంది. రామం తన స్టూడెంట్సందర్నీ సామాన్లు దింపమని తాను క్రిందికి దిగాడు. చేపలకంపు భరించనేరక ముక్కు గట్టిగా మూసుకున్నాడు. మైకులోంచి ఆడగొంతుక బెంగాలీలో అనవున్స్‌మెంటు చేస్తోంది. మగపిల్లలందరూ బయటకి వచ్చాక అందరూకల్సి సామాన్లతో టాక్సీలెక్కి కోమల విలాస్ చేరుకున్నారు. కోమల విలాస్‌లోనే మద్రాసీలకి బాగుంటుందని విన్నందువలన ప్రతీ మద్రాసీ (ఉత్తర దేశంలో ఆంధ్ర, కన్నడ, మళయాళ, తమిళులందర్నీ మద్రాసీ లంటారు.) అక్కడే దిగడానికి ప్రయత్నిస్తాడు. రూముల్లో సర్దుకున్నాక స్నానం, భోజనం ముగించి రామం రాష్‌బిహారిలో పడ్డాడు. లేక్ మార్కెట్టుకి ఆడంగు లందరూ వెళ్తున్నారు. చేతుల్లో ప్లాస్టిక్కు బుట్టలూ, హేండుబ్యాగులు. కూరలకి వెళ్తున్నారని వేరే నిదర్శనం అక్కరలేదు. "ఆషూన్ ఆషూన్" అంటూ వర్తకులు అయస్తున్నారు.

"చార్ట ఏకె రాకా ఆషూన్" (నాల్గు ఒక రూపాయి రండి) అంటున్నాడు మరో వ్యాపారి.

లేక్ మార్కెట్టులోకి వెళ్ళి అందర్నీ చూడ సాగాడు ఎవరో మాషీ "ఆలూ కోతోదాం" (బంగాళ దుంపలు ఎంత వెల) అంటోంది కొట్టు వాడు స్వచ్ఛమైన అరవంలో "కిలో రూపాయ" అని జవాబిస్తున్నాడు. పూలతను లిల్లీలని డజను పన్నెం డణాలంటున్నాడు. కలకత్తాలో చాలామంది ఈ పూలని ఫ్లవరు వేజుల్లో పెట్టుకుంటారు. మంచి సువాసన ఉండి తెల్లటి పూలతో వచ్చటి కాడలు చక్కగా ఉంటాయి. వెల ఎక్కువకూడా కాకపోవ డంతో అందరూ కొంటారు రామం కూడా ఒక డజను కొని వెంకటలక్ష్మి పిన్నికివ్వవచ్చని బయలు దేరేడు. ప్రియా టాకీసు దగ్గర్నుంచి పక్కకి తిరిగి మెల్లగా పిన్ని ఇంటికి వచ్చి కాలింగుబెల్లు నొక్కాడు. తలుపులు తీసిన సుజాత "అమ్మా! రామం అన్నయ్య వచ్చాడు" అంది.

"ఏరా ఇదేనా రావటం" అంటూ వచ్చిన పిన్నిని చూస్తూ "కాదు పిన్నీ చాలాసేపయింది. కాలేజీ పిల్లలతో. ఎక్స్కర్షన్‌కి వచ్చాను."

"అయితే ఈసారీ ఇక్కడ దిగటంలేదన్న మాటేగా" అంటూ లోపలికి పిల్చింది. ఇంతకు ముందు రెండుమార్లు కలకత్తా కొచ్చినపుడూ కోమల విలాస్‌లోనే దిగాడు రామం. దాన్ని జ్ఞాపకం చేస్తూన్న పిన్నికి నేరుగా జవాబివ్వకుండా "లేక్ మార్కెట్టులో కన్పిస్తే కొన్నాను" అంటూ లిల్లీల నిచ్చాడు రామం.

డ్రాయింగు రూములో పెద్ద ఫ్లవర్ వాజ్ ఖాళీగా ఉండటం గమనించిన సుజాత "అమ్మా నా చేతి కివ్వవే! వాటిని సమంగా క్రింద కత్తిరించి వాజులో పెడ్తాను" అంటూ తీసుకు వెళ్ళిపోయింది.

"శ్రీను ఏడి పిన్నీ ?"

"వాడికి అశోక్ అన్న మళయాళీ అబ్బాయి స్నేహితుడున్నాడు కదా! వాడితో వెళ్ళాడు. ఆ పిల్లాడు మళయాళం వాళ్ళని చెప్పితేగానీ తెలవదు. వాళ్ళ నాన్న తెలుగు ఊర్లలో పని చేసినందున ఈ పిల్లాడు తెలుగే నేర్చుకున్నాడు. తెలుగే మాట్లాడు తాడు. ఇద్దరూ ఒకే ఆఫీసు అవడంతో కల్సి తిరుగు తున్నారు. నే వద్దంటే మానుతారా ఏవిటి ?"

పూలని తీసుకుని వచ్చిన సుజాత వాజులో అమరుస్తోంది.

"అమ్మ ఎప్పుడు ఇంతే అన్నయ్యా! బయటికి వెళ్ళితే చాలు అన్నీ అబ్జెక్షన్సేను."

"కాఫీ తెస్తానుండు" అంటూ తల్లి వెళ్ళగానే సుజాత ప్రారంభించింది.

"చూడన్నయ్యా. నా కాలేజీలో ఆడపిల్ల లందరూ వాళ్ళ బాయ్ ఫ్రెండ్సుతో శనాదివారాలు హోటళ్ళకీ సినిమాలకీ వెళ్ళిపోతారు. వాళ్ళవాళ్ళేం అనరు. నేనలా వెళ్తానను కానీ నా స్నేహితురాళ్ళతో వెళ్ళినా అమ్మకనుమానమేను, ఎప్పుడేనా నలుగురూ వచ్చినపుడు, రికార్డు ప్లేయరులో ఇంగ్లీషు మ్యూజిక్ పెట్టుకుంటే విసుక్కుంటుంది. తనుమాత్రం ఎంతసేపు కర్నాటక సంగీతం వినటంలేదు ?" అంది సుజాత ఫిర్యాదులా. కాఫీ తీసుకువచ్చిన వెంకటలక్ష్మి కూతుర్ని చూస్తూ రామంతో అంది.

"రామం. నే వినేది రాత్రి ఎవరూ లేనపుడు ఎవరికీ డిస్టర్బన్సు లేకుండాను. వీళ్ళు గొడవగా అందరి పనులు ఆగిపోయేటట్లు వింటే ఎలా చెప్పు. ఇంటివాళ్ళు సంధ్యాదీపం పెట్టుకుంటూ నల్గురూ కలిసి శ్రావ్యంగా పాడే సమయాన్న ఇది గట్టిగా ఇంగ్లీషు పాట పెట్టవచ్చా చెప్పు. అందుకే వద్దంటాను."

"ఆ పాటలన్నీ మెల్లగా వింటే బావుండవు. స్టీరోఫోనిక్‌లో వినాలి తెలుసా."

రామం ఇద్దరికీ జవాబివ్వలేదు.

శ్రీను అశోకుతో వచ్చి ఈ కబుర్లకి అడ్డు వచ్చాడు. శ్రీను అశోకుని రామంకి పరిచయంచేసాడు. రామం వాళ్ళందరిదగ్గరా సెలవు తీసుకుని హోటలుకి వెళ్ళాడు. పిల్లలందరూ అన్నాలు తిన్నాక అందర్నీ తీసుకుని దేశప్రియా పార్కూ లేక్సూ చూపించాడు. మర్నాడంతా కల్సి శాంతినికేతన్‌కి వెళ్లారు. శాంతి నికేతన్‌లోనే రోజంతా గడిపి సాయంత్రం బయల్దేరి మళ్ళీ కలకత్తాకి వచ్చారు. ఆ మరునాడు బేలూరు, దక్షిణేశ్వరం చూసివచ్చాక కలకత్తాలో వాటిని చూడ్డం ప్రారంభించారు. బిర్లా ప్లానటోరియం అవీ చూసారు. న్యూమార్కెట్టు కెళ్ళి సామాన్లు కొన్నారు. ఈ ప్రయాణంలో కాలేజీలో అబ్బాయి లందరూ మాట్లాడుకున్న వాటినిబట్టి అందరూ కూడా, ఇంట్లో పెద్దవారు తమని అర్థంచేసు కోవటం లేదనీ, మరీ కఠినంగా వుంటున్నారని, కొంచెంకూడా ఫ్రీడము ఇవ్వటంలేదనీ అభిప్రాయ పడుతున్నారని గ్రహించాడు రామం. రామం, సుందరం, వేణు కలిస్తేకూడా యిదేగా అను కుంటారు !

మరునాడు వెళ్ళిపోతామనగా ముందరరోజు మళ్ళీ పిన్ని ఇంటికెళ్ళాడు రామం. పిన్ని ఎవ రింట్లోనో "బహూబాత్"కి వెళ్ళింది. సుజాతా, శ్రీను, అశోకు మాత్రం వున్నారు. రామం వాళ్ళతోకల్సి మసాలామూరీ (మరమరాలు) తింటూ, కబుర్లు వేసాడు.

"అన్నయ్యా, మూర్తిమావయ్య చూడు, తను విదేశాలకి వెళ్ళాడుకదా! క్లబ్బులకి వెళ్తాడు కదా! అలాంటప్పుడు మాధవిని మాత్రం ఎక్కడికీ పంపడేం" అంది సుజాత.

రామంకి అదే అన్పించినా వున్న నలుగురిలో తనే పెద్దవాడు గనుక సర్దిచెప్పుతూ.

"పెళ్లి అవాల్సిన ఆడపిల్లకదా! అందువల్ల జాగ్రత్తగా ఉండమంటాడు మావయ్య. రేపు పెళ్లయి అత్తవారింటి కెళ్లితే కాబరేకి మొగుడు తీసుకెళ్లితే మావయ్య ఏవన్నా అంటాడా ?"

"మావయ్య కాకపోతే మరో పెద్దవారుండ రేమిటి ? పెళ్ళయి వెళ్లితే అత్తగారుంటుందిగా ! ఆవిడ వూరుకుంటుందేమిటి ? ఆ ! మానాడెరి గామా ? యిలా మొగుళ్ళూ పెళ్లాలు కల్సితిర గడం ! అనదూ !" అంటూ యాక్షనుచేసి చూపే సరికి, సుజాతని చూసి మిగిలిన ముగ్గురూ నవ్వారు.

శ్రీను అన్నాడు.

"మనల్ని అబద్ధాలు చెప్పకంటారా రామం. నాన్నగారు డ్రింకు పార్టీలకి వెళ్లారనుకో. అమ్మ వచ్చినవాళ్లతో అలా చెప్పుతుందా ? ఆఫీసులో లేటు అవుతుందన్నారు అంటుంది. ఇప్పుడీ ఇంగ్లీషు విషయమే చూడు — వద్దు వద్దు అని మినిష్ట ర్లంటున్నారా ? వాళ్ల పిల్లలంతా కాన్వెంటుల్లోనే

> **జరిగిన కథ 1 :** పూర్వకాలం మనిషి యాజులుగారి సంతానం శాస్త్రి, మూర్తి, వెంకటలక్ష్మి, మహాలక్ష్మిలు. సుందరం, వేణు, మాలతిలు శాస్త్రిగారి సంతానమైతే మాధవి, రేవతులు మూర్తిగారి కూతుళ్లు. మాలతి బాల్య వితంతువు. గుమాస్తా గోపాలం మాధవిల వివాహానికి ఆటంకంగా నిలుస్తారు మూర్తిగారు.

వున్నారు. ఇక్కడ కాన్వెంటులో సీటు సంపాయించటం ఎంత కష్టమనుకున్నావూ."

"ఇక్కడేకాదు—ఏ వూర్లోనయినానరే కాన్వెంటుల్లో పిల్లలకి సీటు దొరకడం కష్టమేను." అన్నాడు రామం.

"దాన్నిబట్టే తెలియటంలేదూ! పెద్దవాళ్లు చెప్పేదొకటీ చేసేదొకటీ అనీ." అన్నాడు శ్రీను.

అశోకు మాత్రం మాట్లాడలేదు. సుజాతనే చూస్తూండటం గమనించాడు రామం. వీళ్లిద్దరూ ఒకళ్లనొకళ్లు చూసుకోవడం గమనించిన రామానికి వీరిద్దరిమధ్యా ఏదో గ్రంథం జరుగుతోందేమోనని అనుమానం వచ్చింది.

పిన్ని వచ్చాక భోజనంచేసి కోమల విలాస్‌కి చేరాడు రామం మర్నాడు కలకత్తా మెయిలెక్కి మళ్లీ కాకినాడకి చేరుకున్నారు రామం, రామం కాలేజీ పిల్లలూ కల్సి. సెలవులు కాకపోయినా వూరికే పిల్లలందరూ అడిగారని కలకత్తాకి ఎక్స్‌కర్షనుకి ఒప్పుకున్నాడు. ఈ కారణంగానైనా సుజాతనీ, శ్రీనునీ, పిన్నినీ చూడవచ్చుకదా అని మనస్సులో అనుకున్నాడు. అలాగే చేసాడుకూడాను.

## 4

దుర్గపూజలు ప్రారంభమవుతాయన్న చిహ్నంగా బెంగాలీ కుర్రాళ్ళంతా వాడవాడంతా తిరుగుతూ చందాలు ప్రోగుచేస్తున్నారు. ప్రతీ కొట్టు "పూజా సేల్సు" అంటూ బోర్డులు పెట్టారు. కొన్ని ఫాక్టరీలలో బోనసు చాలదని శ్రామికులు ఘెరావో చెయ్యటాలు అదీను. ఈ సమయంలో సుజాతని తల్లీ దండ్రీ ఆట్టే ప్రశ్నలు వేసి ప్రతీది ఆరా తియ్యరు. వాళ్ళ "పాడా" (వాడ)లోని దుర్గప్రతిమే బాగుండని అందరూ అనాలని మొగపిల్లలంతా కల్సి చందాలు ఎక్కువ కావాలని పెద్దవారిని బలవంతంచేసి డబ్బు ప్రోగుచేస్తున్నారు దుర్గపూజ ఇంక మూడు రోజులుండనంగా ఆకాశాన్న కాస్త మబ్బువేసింది వెంటనే అందరికీ ఎక్కడ వర్షంపడి పూజా పందిరి లన్నింటినీ పాడు చేస్తుందో నన్న భయం. మర్నాడు పేపర్లన్నీకూడా ఈ విషయాన్ని పెద్ద అక్షరాలతో ప్రచురించాయి.

ఏడాదీ ఎలా కష్టపడ్డా బెంగాలీలు నవరాత్రులప్పుడన్నీ మర్చిపోయి కులాసాగా తిరిగి నలుగురిళ్ళకీ వెళ్ళి తీపి (మిష్టి) తినివస్తారు. వారి వారి తాహతునిబట్టి సామాన్లు బట్టలు కొనుక్కొంటారు. ఇలాంటి పండుగలు మానవుని జీవితంలో ఎంత ముఖ్యమైన మార్పులనితెస్తాయోదుర్గాపూజలప్పుడు కలకత్తాలో వుంటే తెలుస్తుంది. చిన్నప్పటినుంచీ కలకత్తాలోనే పెరిగినందువల్ల సుజాతకన్నీ వాళ్ళ అలవాట్లే వచ్చాయి. తల్లితో వెళ్ళి మంచి జరీ కుట్టుపని చేసిన లేత ఆకుపచ్చ రంగు నైలక్సు చీర కొనుక్కుంది నవమినాడు ఆ చీరకట్టుకు "పాడా"లో పందిరిలో నున్న దుర్గ ప్రతిమ దగ్గర నిల్చుండగా శ్రీనూ అశోకూ కూడా వచ్చారు.

మొలిచినట్లుగా చీర కట్టుకుని బెంగాలీలా జుట్టుని విరబోసుకున్న సుజాతనే అశోకు రెప్ప వాల్చకుండా చూసాడు. సుజాత సిగ్గుపడి మెల్లగా ఇంటికి వచ్చేసింది. దశమినాడు ఇంటింటికీ వెళ్ళి "విజయదశమి" శుభాకాంక్షలు తెల్పివచ్చారు అన్నాచెల్లెళ్ళు.

దుర్గాపూజ లవడంతోనే ఆకాశం మేఘావృత మయింది. కాలేజీ తెరవడంతో ఆ వర్షంలోనే సుజాత కాలేజీకి వెళ్లసాగింది. క్రితం రెండు రోజులూ ఆగకుండా వాన పడటంతో కాలేజీ వున్న సందంతా నీరుమయం. ఆ వర్షం కారణంగా ప్రిన్సిపాలు సెలవిచ్చినా ఆడపిల్లలు వెళ్లగలిగే పరిస్థితులలో లేరు. ఆ నీటిలో నడవగలం అని బయలుదేరినవారుకూడా వెనక్కి వచ్చేసారు. కారణం నీటిలో వచ్చిన జలగలు. అటుపైని ఎక్కడ గొయ్యి వుందో, ఎక్కడ పల్లమో, ఎక్కడ ఎత్తుగా వుందో ఏమి తెలవటంలేదు. అయోమయంగా వున్న ఆ పరిస్థితులలో ఆశాకాంతిలాగా మిణుక్కుమన్నాడో రిక్షావాడు. మెయిను రోడ్డుకి చేరెయ్యడానికి మనిషికి రూపాయి అడిగాడు. సరేనని ఒప్పుకుని ఎక్కింది సుజాత. మెయిను రోడ్డుమీద దిగింది. ఆ రిక్షావాడు మళ్లీ కాలేజీకి పోయాడు. ఈరోజు నెలకి కావల్సినది సంపాదిస్తాడు అనుకుంది సుజాత.

మెయిను రోడ్డుమీద రాష్‌బిహారికి వెళ్లే బస్సుకోసం నిల్చుంది. వచ్చిన ఒక్క బస్సు చోటు లేకపోవటంతో ఎక్కనేరక నిల్చుండిపోయింది. ఎప్పటికైనా ఇంటికెళ్తామా అన్న సందేహం వచ్చింది. ఆలోచిస్తూన్న సుజాత ప్రక్కనే కారు ఆగటంతో చూసింది. కారులోంచి అశోకు వంగి ఈ ప్రక్కతలుపు తెరిచి "కమిన్ సుజాతా. ఇంట్లో దింపేస్తాను" అన్నాడు.

"థాంక్సు" అంటూ ఎక్కింది.

కారు మెల్లగా డ్రైవుచేస్తూ మాట్లాడటం ప్రారంభించాడు అశోకు.

కారు వస్తూంటే మధ్యదారిలో ఒక అమ్మకపువాడు వేడి వేడిగా ఆలూ టిక్కా వేస్తున్నాడు.

"అబ్బ ఈ చలికి ఆ ఆలుటిక్కా వేడిగా తింటే బాగుంటుందికదూ!" అన్నాడు.

"అవును" అని సుజాత అవగానే కారు వాడి ప్రక్కనే ఆపాడు.

"దూటా ఆలూటిక్కా" అని చెప్పేసి సిగరెట్టు వెలిగించాడు అశోక్





హైదరాబాదు కృష్ణదేవరాయ భాషానిలయంలో జరిగిన కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారి జయంతి ఉత్సవ సభకి ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారు అధ్యక్షత వహించారు. భాషానిలయం గ్రంధాలయ విభాగాన్ని తిలకిస్తున్న శ్రీ రాధాకృష్ణగారిని, భాషానిలయం కార్యదర్శి శ్రీ ఎం. ఎల్. నరసింహారావు, శ్రీ వెంకట రామన్‌గార్లని కూడా చిత్రంలో చూడవచ్చును.

సిగరెట్టుకేసి చూస్తున్న సుజాతకి తాతగారు జ్ఞాపకం వచ్చారు.

ఎవరేనా మొగపిల్లలు సిగరెట్లు కాలుస్తున్నట్లు తెలవగానే గట్టిగా రంకెలుపెట్టుతారు. ఈకాలం పిల్లలు సిగరెట్టు కాలుస్తే, మావయ్యా వాళ్లు చుట్ట కాలుస్తారు. అంతే తేడా. ఏదైనా పొగాకేకదా! తాతగారి కలవాటు లేదుగానీ అతని తోటి వారందరూ తమలపాకులూ పట్టే వేసుకోరూ! చిన్నవాళ్లు చేసేసరికి లెక్చర్లు దంచుతారు. గురివిందగింజ సామెతలా అనుకుంది సుజాత.

అశోకు "సుజాతా" అంటూ పింగాణీ ప్లేటు ఆలూటిక్కాతోటే, చోలాతోటి అల్యూమినియం స్పూనుతోటి యిచ్చాడు. చోలా (సెనగలు) ఆలూతో కలిపి తింటూ అశోకుతో కబుర్లు చెప్పింది రిక్షావాడి గురించి చెబుతూ.

"ఎంతన్యాయం చూసారా! మేం రానేరం కదా అని ఆ కొంతమేరకే రూపాయి అడిగాడు" అంది.

"మామూలు రోజులయితే మీరు వాడి రిక్షా ఎక్కేవారా? వాడికి డబ్బు వచ్చేదా? మేకె హే వైల్ ది సన్ షైన్స్ అని వాడు రూపాయి అడిగి వుంటాడు." అన్నాడు.

సుజాత అవునంటూ తలూపింది. తినడం అయ్యాక డబ్బులిచ్చేసి సుజాతని ఇంట్లో దింపేడు అశోకు.

"లోపలికివచ్చి వేడిగా కాఫీ త్రాగండి" అంటూ ఆహ్వానించింది.

"మరోసారి శ్రీనుతో కల్సివస్తాగా" అంటూ వెళ్లిపోయాడు.

అప్పుడే హాలులోకి వచ్చిన వెంకటలక్ష్మి కూతుర్ని చూసి "ఎలా వచ్చావే ఈ వర్షంలో, బస్సు లొస్తున్నాయా?" అని అడిగింది.

"కాలేజీ దగ్గర్నుంచి మెయినురోడ్డుకి రిక్షలో వచ్చేను. మెయినురోడ్డులో అన్నయ్య ఫ్రెండు అశోకు కన్పించి కారులో తీసుకొచ్చి దింపారు" అంటూ పుస్తకాలని తీసుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది సుజాత.

"ఏవిటో పాడు చదువులూ తిరగడాలూ", అని నిట్టూరుస్తూ వంటింట్లోకి వెళ్ళి కాఫీ తెచ్చింది కూతురుకి. తడిసిన జుట్టుని టర్కీ టవలుతో తుడుచుకుంటూ కాఫీ తీసుకుంది సుజాత.

"అదేమిటే మొఖాన బొట్టులేకుండా జుట్టు విరబోసుకుంటారా ఎవరేనా" అని కూతుర్ని మందలించింది తల్లి.

సుజాత విసుక్కుంటూ అంది "నీది మరీ ఛాదస్తం అమ్మా! ఇప్పుడింకో నిముషంలో పెట్టుకుంటా కదా! ఇంతట్లో ఏంపోయింది."

"ఆడపిల్ల ఇలా జుట్టు విరబోసుకుని ముఖాన బొట్టు లేకుండా కన్పించకూడదు. తాతగార్నడుగు ఈసారి చెప్తారు."

"ఆ అడక్కుండానే చెప్తారు. అతనికి వేరే పన్లేదు. ప్రతీదానికీ చిన్నవాళ్ళని ఏదైనా అనకపోతే తిన్నది అరగదు తాతగారికి..." అంటూన్న కూతుర్ని మధ్యలో ఆపి "అదేవిటే అలా అంటావు. చిన్నం తరం పెద్దంతరం లేకుండాను" అంటూన్న తల్లి నింకా విసిగించడం ఎందుకని లోలోపల తిట్టుకుంటూన్నే లోపలికి వెళ్ళి బొట్టు పెట్టుకుని జడ వదులుగా వేసుకువచ్చింది సుజాత.

వర్షం వస్తూంటే ఆ జుట్టు అలా వదులుగా వదిలేస్తే చిరుగాలికి ముంగురులు కదులూ్తంటే ఎంచక్కగా వుంటుంది. కానీ ఈ అమ్మ వుండ నియ్యదు. అయ్యో కాలేజీ చదువుతున్న పిల్ల దానికేది ఇష్టమో అదే చెయ్యని అని వదల్దు. అనుకుంటూ రికార్డు తీసి వ్రాసుకోవటం ప్రారంభించింది. రెండు నిముషాలకే 'కమిన్ సుజాతా' అంటూన్న అశోకు మొహం జ్ఞాపకం వచ్చి సుజాతకి మధురమైన అనుభూతిని కల్గించింది. మొదట్నుంచీ అశోకంటే సుజాతకి అభిమానం. ఇప్పుడిప్పుడే ఆ అభిమానం మెల్లగా ప్రేమలోకి జారుతోంది.

అటుపైని అన్నయ్యకోసం వచ్చినపుడల్లా పనిగట్టుకువచ్చి అశోకుతో కబుర్లు చెప్పేది. వాళ్ళిద్దరూ వున్నచోటుకే వెళ్ళి బొమ్మలు గీస్తూనో, వ్రాస్తూనో క్రీగంట అశోకునే చూసేది. అశోకు చూపులుకూడా తనమీదే కేంద్రీకరించి ఉన్నాయన్న సంగతి తెల్సి కళ్ళు దించేసుకునేది. ఇలా నయన భాషలో ఇద్దరూ సంభాషించుకునేవారు.

కబుర్లు చెప్పినపుడల్లా ముగ్గురూకూడా పెద్దవారు పిల్లల్ని అర్ధం చేసుకోవటంలేదనీ, ఈ అంతరాల తేడావల్లే ఇన్ని అనర్ధాలు జరుగుతున్నాయి అనీ, చిన్నపిల్లలు చెడుత్రోవన పోతున్నారని తీవ్రంగా వాదించుకునేవారు. ఇవన్నీ తల్లి ఇంట్లో లేకపోతే నేను. తల్లి ఇంట్లో ఉంటే మాటలే ఉండేవికావు. ఏవో లోకాభిరామాయణం, ఊర్లోని స్త్రీయికులు గురించీ మాట్లాడేవారు.

ఒకసారి మాధవి సంగతి ఉత్తరాలవల్ల అర్ధం చేసుకున్నారు వీళ్ళు. దానితో సుజాతకి తాతగారన్నా మావయ్యలన్న కోపం ఎక్కువయింది "అన్నయ్యా, మాధవి చేయబోయినది తప్పెలా అయింది."

"పెద్దవాళ్ళ ప్రకారం తప్పేను" అన్నాడు అశోకు.

"అమ్మే చెప్పింది ఎన్నోసార్లు. పూర్వం పల్లెటూళ్ళలో గొప్పవాళ్ళకి పెళ్ళాం గాకుండా బోగంది ఉండేదని. దానికంటె ఇది అన్యాయమా!" అంది కోపంగా సుజాత.

"మన ప్రకారం తప్పు కాకపోవచ్చు, వాళ్ళ ప్రకారం సాంప్రదాయానికి వ్యతిరేకమైనది ఏదైనా తప్పేను. మనవారికి మొగవాడు గంగా సమానుడు. ఎన్ని పాపాలు చేసినా కడుక్కుపోతుంది. కానీ ఆడది అలాక్కాదు."

"ఏం ఎందుకని?" అని ఎదురుప్రశ్న వేసింది సుజాత.

"సుజాతా ప్రకృతే అలా చేసిందికదా! కాలు జారితే మగవానిక్కాదు నష్టం. ఆడదానికే ప్రకృతి ముద్రని వేస్తుంది" అన్నాడు అశోకు.

అప్పుడే లోపలకి వచ్చిన సుజాతా వాళ్లమ్మ అది విని "చిన్నవాడివైనా బాగా చెప్పావయ్యా! అరిటాకు వెళ్లి ముల్లుమీద పడ్డా, ముల్లు వెళ్లి అరిటాకుమీద పడ్డా అరిటాకుకే నష్టం. అందుకే ఆడదాన్ని జాగ్రత్తగా మసలుకోమని పెద్దవారు చెప్తారు" అంది.

సుజాతకి వొళ్లు మండిపోయింది. ఈ సామెత వింటేనే సుజాతకి ఒళ్లు మంట. కాలం మారిందంటారుకాని మనుష్యులవన్నీ బూజుపట్టిన అభిప్రాయాలే అని విసుక్కుంది సుజాత.

తల్లితో వాగ్వాదం పెంచడం యిష్టంలేక వూరుకుంది. శ్రీనూ, ఆవిడా కల్సి లోపలకి వెళ్లేసరికి సందు చూసుకుని అశోకు సుజాతతో అన్నాడు "ప్లీజ్. రేపు శనివారమేగా. నాకోసం బస్సుస్టాపులో ఆగండి. ఎక్కడికేనా వెళ్దాం."

ఇది విన్న సుజాత గుండె వేగంగా కొట్టుకుంది.

## 5

మర్నాడు కాలేజీకి శ్రద్ధగా ముస్తాబయింది. తండ్రి తెచ్చియిచ్చిన ఫారిన్ నైలానుచీర కట్టుకుంది. తలలో ఒకప్రక్క గులాబీ తురిమింది. తల్లితో "రావడానికి ఆలస్యమవుతుంది" అని చెప్పి వెళ్లింది.

"కాలేజీలో ఒక్క పాఠంకూడా తలకెక్కలేదు. పరధ్యానంగా వుండి ఎప్పుడెప్పుడు ఒంటిగంటవు

తుందా అని చూస్తూ కూర్చుంది. బెల్లు కొట్టగానే బయలుదేరి మెయిను రోడ్డులోని బస్సుస్టాపుకి వచ్చింది. అశోకు కారులోవచ్చి బస్సుస్టాండు దగ్గరగా కారుని ఆపాడు. డోర్ తియ్యగానే సుజాత కారెక్కింది. ఇద్దరూకల్సి న్యూమార్కెట్టుకివెళ్లారు.

న్యూమార్కెట్టు ఒక చిన్న ప్రపంచం. అది రంగులంగుల ఇంద్రజాలం. అందులో అడుగు పెట్టితే ఒక్కో కొట్టునీ చూస్తూంటే గంటలు నిముషాల్లాగా గడిచిపోతాయి. పనిలేనివారు కాలం గడపడానికీ, డబ్బున్నవారు ఫాషన్లకీ, కొనాలనుకున్నవారు కొనుక్కోవడానికీ న్యూమార్కెట్టుకి వస్తారు.

న్యూమార్కెట్టులో నడుస్తూ అడిగాడు అశోకు. చుట్టుతిరిగి, చెప్పదల్చుకున్నదానికి ఉపోద్ఘాతంతో కాలయాపన చేసి నేరుగా చెప్పదల్చుకున్నది చెప్పకుండా వేరే ఏవేవో మాట్లాడతారు కొందరు. అశోకు అలాకాదు.

"సుజాతా! నన్ను మీరు ఎరుగుదురు. నేనూ మీయింటికి వస్తోన్నందువలన మిమ్మల్ని గురించి నేను ఒక అభిప్రాయం ఏర్పరచుకున్నాను. మీరు నా కళ్లకి అతి అందంగా వున్నారంటే అది అతిశయోక్తి కాదు. నాకు మీరు నచ్చారు. మీకు నేను నచ్చానా ? అన్నదే యిప్పటి ప్రశ్న."

ఇంత నేరుగా అడిగేసరికి సుజాత నిర్ఘాంతపోయింది. వెంటనే జవాబివ్వలేదు.

"అయితే, మౌనం అర్ధాంగీకారంగా తీసుకోవచ్చా" అన్న అశోకు మాటలకి తల వూపింది.

"దీనికి మీరు అవునంటే మనం ఎన్నో ప్రశ్నలని ఎదుర్కోవాల్సి వస్తుంది. మొట్టమొదట మీ అమ్మా నాన్నని ఒప్పించనేరం. మానాన్న ఏమంటారో అదీ తెలియదు. శ్రీను ఏం అంటాడో. రోజు రోజూ ప్రళయాలు తుఫానులూ రావచ్చు. వీటన్నింటినీ భరించగలమా అని ఆలోచించుకుని మరీ ఒక నిర్ణయానికి రావాలి." అని అశోకు అంటూంటే సుజాత గుడ్లప్పగించి చూస్తూండిపోయింది.

సినిమాల్లో హీరోల్లాగ డ్యూయెట్లు పాడకుండా, పార్కులవెంట తిరక్కుండా మొట్టమొదటే బిజినెస్‌మాన్‌లాగా లాభనష్టాలని బేరీజు వేసి ఫలానా ఫలానా జరగవచ్చు అంటూ చెప్తూన్న అశోకుని మెప్పుతో చూస్తూ నిల్చుంది.

"మనం పెళ్లి చేసుకుందామా అన్న నా ప్రశ్నకి వెంటనే జవాబివ్వక్కరలేదు. మెల్లగా యింటికెళ్లి ప్రశాంతంగా ఆలోచించి మరీ జవాబు చెప్పవచ్చును." అన్న అశోకుతో అంది.

"నాకు ఆలోచించడాని కింకేంలేదు. నేను అన్నింటికీ సిద్ధమేను" అని.

అశోకూ సుజాత ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటూ నయనాలతో సంభాషిస్తూ న్యూ మార్కెట్టంతా తిరిగి దగ్గరలోనున్న రెస్టారెంటులో కాఫీ త్రాగారు. అశోకు సుజాతని ఇంటిదగ్గర దిగబెట్టి వెళ్ళిపోయాడు. సుజాతకి మొదట తల్లిని చూసేసరికి నేరం చేసినట్లనిపించింది. గబగబా గదిలోకి వెళ్ళిపోయింది.

ఆనాటినుంచీ ఇద్దరూ అప్పుడప్పుడు కల్సుకునేవారు. శ్రీనుకి కూడా చెప్పారు. శ్రీను కందులో తప్పేం కన్పడలేదు. శ్రీనుకూడా వీళ్ళిద్దరితో కల్సి సినిమాలకీ అదీ వెళ్ళేవాడు. మెల్లగా పెళ్లి ఎలా చేసుకోవడం అన్న ప్రశ్నని మథించసాగారు. వాళ్ళకే అర్థం కాలేదు. సుజాత రామం అన్నయ్యకి వ్రాద్దామనేసరికి సరేనని వ్రాయమన్నారు. కాళీపూజకి సన్నాహాలుతో ముగ్గురూ పాడా (వాడ)లోని వారితో కల్సి మళ్ళీ హడావుడిలో మునిగిపోయారు.

రామం దీపావళికని తాతగారింటి కెళ్ళాడు. కాకినాడ రేవు దాటితే ఇట్టే తాతగారింటి కెళ్ళవచ్చునుకదా అని రామం రెండు మూడు రోజులే సెలవులయినా సుందరం దగ్గరకి వెళ్ళిపోతాడు. అందరికీ సుందరం అంటే గురి. అంత చదువుకునీ సింపుల్‌గా పల్లెటూళ్ళో ఉండడానికి ఒప్పుకున్నాడని సుందరమంటే వీళ్ళందరికీ గౌరవం. దీపావళికి ఊరుకి వెళ్ళినపుడు సుందరాన్నడిగే సుజాతకి జవాబు వ్రాద్దామని ఉపేక్షించాడు.

త్రయోదశినాటికి వూరుకి వెళ్ళాడు. రామం ఇంటికెళ్ళేసరికి తాతగారు నట్టింట కూర్చుని మండువా వాకిట్లో కూర్చున్నవారితో కాలక్షేపం కబుర్లు చెప్తున్నారు. తాతగారిని అప్పుడు పలకరించకూడదని రామంకి తెల్సు. మెల్లగా క్రొత్తయింటికేసి వెళ్ళిపోయాడు. మాలతి చూసి "రా బావా" అంటూ పిల్చింది. గదిలోకి వెళ్ళి సంచీ పెట్టేసి నూతి దగ్గరకి కాళ్ళు కడుక్కోవడానికి వెళ్ళిపోయాడు.

సుందరం వచ్చాక, అందరూ స్నానాలు ముగించి మడికట్టుకుని భోజనాలకని వెళ్ళేరు. ముగ్గురు మగవాళ్ళూ తిన్నాక, దూరపు మట్టమైన నరసమ్మత్తయ్యతోబాటు మాలతికూడ ఫలహారం చేసింది.

సుందరం, రామాలకి డాబా గదిలో పక్కలు వేసి తండ్రికి మంచినీళ్ళు పెట్టి తన గదిలోకి వెళ్ళిపోయింది మాలతి. తండ్రి వీధిలోకి వెళ్ళి వూరు విశేషాలన్నీ మాట్లాడి మరీ వచ్చాకే తలుపులు తాళాలు పెట్టడం పని.

రామం సుందరం డాబాలో కూర్చున్నారు. అమావాశ్య దగ్గర పడుతున్నందువలన చంద్రుడు లేడు. కానీ నక్షత్రాలు మాత్రం బాగా మెరుస్తున్నాయి.

రామం సుందరాలు కలిస్తే కుటుంబ విషయాలన్నీ చర్చించుకుంటారు.

సుందరం మాధవి గురించి రామంతో చెప్పాడు.

"మాధవిని గోపాలుకిచ్చి చేసెయ్యకూడదూ సుందరం ?"

"అదెలాగ. బాబయ్యకి పొజిషను కావాలి. గోపాలు బాబయ్య ఆఫీసులోనే పని చేస్తున్న గుమాస్తా. బాబయ్యకి ఉంగిరాలచేతితో మొట్టితే నొప్పి ఉండదు. కానీ తన సమ అంతస్థు కాని వారైతే కంటిలోకూడా పడరు. అలాంటప్పుడు పిల్లని గుమాస్తాకిస్తాడా ?"

"పిల్ల నలుపు కదా! కోడలు నలుపైతే కులమంతా నలుపవుతుందని చాలామంది ఆడవారు అభిప్రాయ పడతారు కదా! అందులోనూ గొప్ప సంబంధం కావాలి అని వెడితే ఎక్కువ కట్నం అడగరూ ?"

(28 వ పేజీ చూడండి)



# యువతరం

"తిండి కలిగితే కండ కలదోయ్ కండ గలవాడేను మనిషోయ్" అని గురజాడవారు సెలవిచ్చినట్లు విద్యార్థులు చాలామంది గ్రహించడంలేదు కాని శిఖరం సత్యనారాయణ మాత్రం శరీర సౌష్టవంలోను, ఆటల ధాటిలోను మేటి అనిపించుకుంటున్న తెనాలి కాలేజీ బి. కామ్. స్టూడెంటు.

పోలీసు అధికారి నవ్వాల సుందన్నాడు సత్యనారాయణ. అవినీతికి ఆ శాఖలోకూడా "ధాన్సుం"టుందేమో కాని, తనమట్టుకి తను అవినీతి నిర్మూలనకే కృషి చేస్తానన్నాడు. రోజూ వ్యాయామం చేస్తాడు. అరవై అయిదు కిలోగ్రాముల బరువు, ఐదడుగుల ఎనిమిదంగుళాల ఎత్తుగల యీ యువకుడు యిరవై ఏళ్లవాడు. చీరాలలో 1971 సం.లో జరిగిన గుంటూరు ఒంగోలు జిల్లాల 'బస్కీ'ల పోటీలో బంగారు పతకం అందుకున్నాడు. ఆ మరుసటి సంవత్సరంలో జిల్లా శరీర సౌష్టవ పోటీలలో ద్వితీయ బహుమతి అందుకున్నాడు. బస్కీలు, కండ సౌష్టవం మాత్రమే గాకుండా సత్యనారాయణ వెయిట్‌లిఫ్టర్ కూడా... చాలా ప్రయిజులు సాధించాడు, మిస్టర్ గుంటూరు, లేక "గుంటూరుశ్రీ" కూడా అయినాడు ఒకసారి. ఆటలలో కబడ్డీ, బాస్కెట్‌బాల్ లాంటివి ఆడుతాడు. ఏటా వెయిట్ లిఫ్టింగ్‌లోను, శరీర సౌష్టవంలోను ఎక్కడ పోటీలు జరిగినా వెళ్లి పాల్గొని, తప్పకుండా బహుమతి చూరగొంటూ వున్న శిఖరం సత్యనారాయణ, యీ 'రంగం'లో 'శిఖరాగ్రం' చేరాలని కష్టపడి కృషి చేస్తూనే చదువుకుంటున్నాడు. మార్కులు ఏవరేజ్‌గా వస్తాయట! అయితే గ్రాడ్యుయేట్ అయి ఐ.పి.యస్. కి వెళ్లాలన్న పట్టుదల గలదని చెప్పాడు. — ఇతనికి రాష్ట్రస్థాయి నుంచి దేశస్థాయి కీర్తి ప్రతిష్టలు వచ్చే కృషి చేయటం ముఖ్య ధ్యేయం అయితే తెనుగు "యువతరం" అంతా హర్షిస్తారన్న మాటలో అతిశయోక్తి వుండదు.

[ వీరాజీ ]



"సోగ్గాడు"లో మంజుభార్గవి

# సినిమా విశేషాలు

## జయసుధ జాతకం

ఫ్యూచర్‌హోప్ వున్న ఒకరిద్దరిలో జయసుధ ఒకర్తె అని పరిశ్రమలోని పెద్దలు అభిప్రాయపడుతున్నారంటె, ఆమెలో ట్యాలెంటు వున్నట్టేగా!

ఈమధ్య జయసుధను ఆమె యింట కలిశాను షూటింగుకు హడావిడిగా బయల్దేరుతూవుంది బాలచందర్‌గారి "అపూర్వ రాగంగళ్" ఆఖరి కాల్‌షీటు అని చెప్పింది

తెలుగు నిర్మాతలు తనకు మంచి పాత్రలను యిస్తున్న నిజాన్ని చెప్పి, కృతజ్ఞతలు తెలియ చేసింది

ప్రముఖ నిర్మాత విరలాచార్యగారి జానపదంలో తనకు బలే వేషం లభించిందట మరేష్ నాయుడు గారి "సోగ్గాడు, ఒక చల్లని రాత్రి" చిత్రాలలో వెరైటీ వేషాలు ధరిస్తున్నదట "నల్లరేగడి"లో ప్రాధాన్యత వున్న పాత్ర దొరికిందట

ప్రస్తుతం వెంపటి చినసత్యంగారి వద్ద కూచిపూడి నభ్యసిస్తున్నదట అన్ని అర్హతలు వున్న జయసుధ జాతకమ్ జోరుగా వుంటుంది

## హేమాలయ పిక్చర్స్!

పరిశ్రమలో "మంచివాడు" (అందరిచేత) అనిపించుకోవడం సాధ్యమేనని నిరూపించారు, సత్తిరాజు – వెంకన్నబాబుగార్లు ఈ యిద్దరూ నిర్మాణ నిర్వహణాధికారులుగా ఎన్నో చిత్రాలకు పని చేశారు

ఈ మిత్రులు స్థాపించిన సంస్థ "హేమాలయ పిక్చర్స్" పేరు "అమానుష్" చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తున్నారు

ఉత్తమకుమార్ పోషించిన పాత్రను కృష్ణంరాజు, శర్మిలా ధరించిన భూమికను చంద్రకళ నిర్వహిస్తున్నారు (కరెక్ట్ సెలక్షన్)

"అమానుష్" చిత్రానికి దర్శకుడుగా పాతకమూరి రామచంద్రరావును ఎన్నుకోవడం జరిగింది ప్రతిభ, సృజనాత్మక శక్తి, వివేకం వున్న యువకుడు రామచంద్రరావు తన తొలి ప్రయత్నంలో విజయుడయ్యే విధంగా కృషిచెయ్యగల ధీమంతుడే

"స్వర్గంలో నరకం"లో జయసుధ

## ఆదిమానవులు

పూర్వం మానవుడు ఎలా వుండేవాడు? అతగాడి ఆహారం ఏమిటి? ఎలాంటి జీవితాన్ని గడిపేవాడు? ఎట్టి నాగరికతకు అలవాటుపడ్డాడు? అనేడి అంశాలపై నిర్మితమైన వర్ణ చిత్రమే "ఆదిమానవులు"

ఈ చిత్రం సెన్సారు కాదని కొందరంటె, తీసినదాంట్లో సగానికిపైగా కత్తిరించబడగలదని మరికొందరన్నారు

మే నెల చివరన యిలాంటి ప్రచారం ప్రారంభమైంది సెన్సారుబోర్డు సభ్యులు "ఆదిమానవులు" చిత్రాన్ని చూచి, 'ఏ' సర్టిఫికేటు నిచ్చారు ఈ చారిత్రాత్మక చిత్రానికి వజ్జ సుబ్బారావు నిర్మాత జి కె మూర్తి దర్శకుడు

నాయికగా కనకదుర్గ, నాయకుడుగా మోహన్‌రావ్ నటించారు

## బాలచందర్ ప్రశంస

ఏ వి కె ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న "లక్ష్మణ రేఖ" చిత్రాన్ని, విఖ్యాత దర్శకుడు కె బాలచందర్ చూచి, దర్శకుని ప్రతిభను, జయసుధ నటనా ప్రాభవాన్ని మనస్ఫూర్తిగా అభినందించారు దర్శకుడు ఎన్ గోపాలకృష్ణకు యింతకంటె కావలసినదేముంది?

తమిళ దేశంచేత అగ్ర దర్శకుడు అని నీరాజనాలందుకొంటున్న బాలచందర్ "లక్ష్మణరేఖ" చిత్రాన్ని ప్రశంసించారంటే, కథలో ఎంత విశిష్టత వుండివుండాలి?

"లక్ష్మణరేఖ" చిత్రం మరాటీ బాషలో విజయఢంకా మ్రోగించింది "ఒక జడ్జి, ఆయన యిద్దరి కుమార్తెలచుట్టూ అల్లబడిన కథ యిది" ఈ చిత్రానికి షణ్ముగం, కృష్ణారావు నిర్మాతలు ఇందులో జడ్జిగా గుమ్మడి, పెద్దకుమార్తెగా జయసుధ, చిన్నకుమార్తెగా సుమ నటిస్తున్నారు

మంచివాడుగా మురళీమోహన్, వంచకుడిగా చంద్రమోహన్ నటిస్తున్నారు సహాయ పాత్రలను అల్లురామలింగయ్య, ఛాయాదేవి, కె వి చలం, గిరిజ, రామదాసు పోషిస్తున్నారు గౌతమీ వెంకటరత్నం నిర్వాహకుడు

## హేమ బలే వేసింది

గౌతమీ రామబ్రహ్మంగారు "అపశ్రుతులు" ఆధారంగా నిర్మిస్తున్న చిత్రం తాలుకు రషస్ చూశాను. నే చూచినది నాలుగువేల అడుగులు మాత్రమే. చూచినంతవరకు చిత్రం ఆసక్తి కలిగించింది. కొత్తమ్మాయి హేమా చవుదరి ఎంతో అనుభవం గడించిన నటివలె తన పాత్రను పోషించింది. హేమకు పేరు తేగల పాత్రను రామబ్రహ్మంగారిచ్చినందుకు, ఆయనకు మంచి పేరును తెచ్చిపెట్టే విధంగా నటించింది.

ఈ చిత్రానికి డి. వి. నరసరాజు రాసిన రచనను, రామబ్రహ్మంగారు చదివి వినిపించారు. ప్రతి మాట, ప్రతి దృశ్యం రసగుళికలవలె వున్నాయి అని చెప్పగలను.

ఈ చిత్రంలో జమున, సత్యనారాయణ, మురళీమోహన్, ఎం. పి. ప్రసాద్, మిక్కిలినేని, టి. జి. కమల మరియు అల్లు రామలింగయ్య ప్రధాన పాత్రధారులు. నిర్మాణ నిర్వహణకు వెంకటరత్నం, సంగీతానికి సత్యం, ఛాయాగ్రహణానికి భాస్కరరావు, కళకు కృష్ణారావు అధిపతులు. డి. యోగానంద్ దర్శకుడు.



బలిపీఠంలో ఒక దృశ్యం

## శోభన్‌కు మరో కిరీటం

రవి శంకర్ ఆర్ట్ పిక్చర్స్ రంగుల్లో నిర్మించిన "బలిపీఠం" చిత్రాన్ని ఎగ్జిబిటర్లు, కొనడానికి వచ్చిన వ్యాపారస్తులు చూశారు. అందరూ "బాగుంది. బలేగావుంది" అని అభినందించారు. "బలిపీఠం" చిత్ర నాయకుడైన భాస్కర్‌గా శోభన్‌బాబు అద్భుతంగా నటించారని, "గురజాడ, కందుకూరి" పాత్రలకు పరిపూర్ణ న్యాయం చేశారని వాళ్లు అభిప్రాయపడ్డారు.

అరుణగా శారద చిత్రం ఆద్యంతం అసమానంగా నటించారట. అలాగే రాజబాబు, రోజా రమణి, నిర్మల, అల్లు రామలింగయ్య, హేమలత ధరించిన భూమికలకు న్యాయం చేశారట. "గెస్టు"గా అగుపించి "బెస్టు" మార్కులను "షావుకారు" కొట్టేస్తారట. అలాగే సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి పాత్రపోషణలో ప్రతిభ ప్రకాశించిందట.

"బలిపీఠం" చిత్రం దాసరి అంతస్తును విపరీతంగా పెంచగలదట. ఇంత మంచి చిత్రాన్ని నిర్మించిన సునీల్ చవుదరిని అందరూ అభినందించారు. ఈ చిత్రం ఆర్థిక విజయంతోబాటు, అవార్డుల వర్షాన్ని తెచ్చిపెట్టగలదన్న నమ్మకాన్ని వెలిబుచ్చారు. ముప్పలనేని శేషగిరిరావు సమర్పించే "బలిపీఠం" చిత్రం నవయుగ ద్వారా జులై 17న విడుదల వుతుంది.

# సినిమా



రాజ్‌కపూర్, రాజేంద్రకుమార్‌లు సంగమ్ తర్వాత 'దో జామూన్' అనే చిత్రంలో కలిసి పనిచేశారు
పై చిత్రంలో లక్ష్మీకాంత్ (సంగీతం), రాజ్‌కపూర్, రాజేంద్రకుమార్
దిగువ శైలేంద్రసింగ్ (పాటలు), భావనాభట్ అనే కొత్త అమ్మాయి వున్నారు

***సీతగా మంజుల***

జనకరాజ పుత్రి సీతగా మంజుల నటిస్తున్న దృశ్యాన్ని, శ్రీ విజయభట్ ప్రొడక్షన్స్ వర్ణ చిత్రానికిగాను, విఖ్యాత దర్శకుడు ఆదుర్తి చిత్రీకరించారు

స్థానిక వుడ్‌లాండ్స్ హోటల్ ఎదురుగా వున్న నందనోద్యానంలో నిర్మించబడిన పర్ణశాలలో సీతారాములు సంభాషించుకున్న సన్నివేశం చిత్రీకరించబడింది

***శ్రీరాముడుగా శోభన్‌బాబు***

ఎంతో అందంగా, గంభీరంగా, హుందాగా ఆగుపించారు సాక్షాత్తు పురాణ పురుషుడివలె కనిపించారు శ్రీ ఎన్ ఎస్ భట్, ఎస్ ఎస్ మూర్తి నిర్మిస్తున్న సోషియో క్రైమ్ చిత్రంలో పౌరాణిక ఘట్టాన్ని అభంగము గాకుండా యిమడ్చగలిగిన దర్శకుడి వూహాశక్తిని మెచ్చుకోవాలి

ఈ చిత్రంలో శోభన్, మంజుల, అంజలీదేవి, కృష్ణకుమారి, కాంతారావు, ప్రభాకరరెడ్డి, ధూళిపాళ, మాడా, జయమాలిని ప్రధాన తారాగణం

***చీకటివెలుగులు***

రంజిత్ మూవీస్ రంగుల్లో నిర్మించిన "చీకటివెలుగులు" చిత్రం ప్రేక్షకాదరణను పొందగల యోగ్యతను బడసియున్నదని, చిత్రం చూచిన వివిధరంగాల ప్రతినిధులు చెప్పారు

నటీనటుల్లో వాణిశ్రీకి అగ్రతాంబూలాన్ని యిచ్చారు ఆమెతోపాటు హీరోగా నటించిన కృష్ణను "బ్రహ్మాండం" అన్నారు పద్మప్రియను తెలుగుదేశపు స్వప్నసుందరి అని అభివర్ణించారు

చిత్రంలోని అన్ని పాటలు మళ్లీ మళ్లీ వినాలనిపిస్తున్నాయి అని చక్రవర్తి పనితనాన్ని ప్రశంసించారు చిత్రం ఆద్యంతం ఎక్కడా విసుగు జనించకుండా జనామోదాన్ని పొందేవిధంగా కె ఎస్ ప్రకాశరావుగారి దర్శకత్వం సాగింది అని అభినందించారు

కాశ్మీరు దృశ్యాలయితేనేమి, ఇన్‌డోర్ హార్మ్యాల వైభవం అయితేనేమి, స్వామి అద్భుతంగా చిత్రించారు అన్నది సినిమాను వీక్షించినవారి అభిప్రాయం ఒక కళాత్మకమైన చిత్రాన్ని నిర్మించిన రంజిత్‌కుమార్‌కు కనకవర్షం తథ్యము లక్ష్మీ ఫిలింస్ విడుదల

## పూర్ణచంద్రరావు కొత్త ప్రయత్నం

ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ నుంచి శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్‌కు వెళ్లాను నే వెళ్లినప్పుడు, నిర్మాత పూర్ణచంద్రరావుగారు బిజీగా ఫోను సంభాషణ గావిస్తున్నారు

'నమస్తే' అంటూ లోపలికి వెళ్లాను "దేవుడు చేసిన పెళ్లి" చిత్రాన్ని హిందీలో నిర్మించే ప్రయత్నం ఎంతవరకు వచ్చింది ? అని ప్రశ్నించాను.

"దాదాపు ఫైనల్ స్టేజిలో వుంది మరో పక్షం రోజుల్లో తారాగణం, సాంకేతిక వర్గం నిర్ణయం కావచ్చు విఖ్యాత బొంబాయి నిర్మాతతో కలిసి హిందీ నిర్మాణం జరగొచ్చు" అన్నారు పూర్ణచంద్రరావుగారు

"తెలుగు చిత్రం షూటింగు సెప్టెంబరు నుంచి ప్రారంభం కాగలదని చెప్పి, శోభన్‌బాబుగారు యింతవరకు పోషించని పాత్రను కథకుడు సృష్టించినట్టు చెప్పారు తాతినేని రామారావు దర్శకుడు హీరోయిన్లు యిద్దరుంటారు" అనేడి వివరాలను వెల్లడించారు

"హి—మాన్" సరసన నటించే అదృష్టం ఎవరిని వరిస్తుందో !



"ఆదిమానవులు"లో ఒక దృశ్యం



"ఆస్తికోసం"లో ప్రమీల

## కృష్ణంరాజు త్రిపాత్రాభినయం

"కృష్ణవేణి" వంటి మాణిక్యాన్ని అందించిన గోపీకృష్ణా మూవీస్ సంస్థవారి "భక్త కన్నప్ప" వంటి ఆణిముత్యాన్ని అందివ్వబోతున్నది

"భక్త కన్నప్ప" చిత్రంయొక్క ట్రీట్‌మెంటును, కృష్ణంరాజుగారి యింట విన్నాను "సుపర్బ్"గా వుంది కమర్షియల్‌గా బాగా "పే" చేస్తుంది

ఈ చిత్రంలో కృష్ణంరాజు త్రిపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా వుండగలదు "అర్జునుడు, తిన్నడు, భక్త కన్నప్ప"గా ఆయన నటిస్తారు. నాయిక 'నీల'గా వాణిశ్రీ నటిస్తున్న యీ చిత్రానికి విక్టరీ మధుసూదనరావు దర్శకుడు

సాంకేతిక శాఖలను ఆదినారాయణరావు — సత్యం, వాలి, స్వామి, సత్యానంద్ నిర్వహిస్తున్నారు.

ఈ చిత్రానికి సినిమా ట్రీట్‌మెంటును తయారుచేసిన వ్యక్తి పేరు భీమేశ్వరరావు "హ్యాట్స్ ఆఫ్ టు హిమ్"

## ఈశ్వరుని అభయ హస్తం

భీమేశ్వరరావును గూర్చి నాలుగు వాక్యాలు రాస్తాను ఈయన మహేష్ కవుల్‌వద్ద సహకార దర్శకుడిగా పనిచేశారు బొంబాయినుంచి మదరాసుకు వచ్చి పదేండ్లు దాటింది ఈయన భరణీ పిక్చర్స్‌వారి "గృహలక్ష్మి" చిత్రానికి అసోసియేట్‌గా పనిచేశారు.

అప్పట్నుంచి, యిప్పటివరకు పది చిత్రాలకు సహకార దర్శకుడిగా తన నేర్పును, శక్తిసామర్థ్యాలను ప్రదర్శించి సెహభాష్ అనిపించుకొన్నారు

పని చేసిన చిత్రాలు పదయితే, అందులో అక్కినేని నటించినవి ఎనిమిది గావడంచేత, ఆయనతో సాన్నిహిత్యం దిన దిన ప్రవర్ధమానమైంది

నాగేశ్వరరావుగారు నటించే చిత్రాన్ని డైరెక్ట్ చెయ్యాలన్న కోర్కె భీమేశ్వరరావుకు ఎప్పట్నుంచో వున్నా, యిటీవల యీడేరింది

భీమేశ్వరరావుకు అక్కినేని అభయహస్తం యిచ్చారు భీమేశ్వరరావు ప్రతిభావంతుడు అన్న అభిప్రాయం నాగేశ్వరరావుకు వున్నది



"చీకటి వెలుగులు"లో ఒక దృశ్యం

## సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్

"ఆడపడుచు" చిత్రం తరువాత "వింత దంపతులు" మాత్రం ప్రేక్షకులను ఆకర్షించగలిగింది హేమాంబరధరరావు తీసే చిత్రాలలో "కామెడీ"కి ప్రత్యక్షమైన గుర్తింపు వుంటుంది

సుభాషిణీ ప్రివ్యూ థియేటరు తన చెయ్యిదాటిన దగ్గర్నుంచి, హేమాంబరధరరావుకు అదృష్టం కలిసిరావడంలేదన్న నిజాన్ని ఎవరూ కాదంలేరు

"మహానుభావుడు" చిత్రాన్ని కృష్ణంరాజు హీరోగా హేమాంబరధరరావు తలపెట్టారు కథను విన్న ప్రతి వ్యక్తి "బలేగావుంది" అన్నారు "పగ—ప్రతీకారం" మీద అల్లబడిన యీ కథకు భమిడి పాటి రచయిత

యువతరాన్ని ఉద్రిక్తపరిచే సంఘటనలు, హుషారును రేకెత్తించే ఘట్టాలు "మహానుభావుడు" చిత్రంలో వున్నాయిగనుక ధనప్రాప్తి తథ్యము అని చెప్పొచ్చు

## రాజుగారి రాబోయే చిత్రాలు

ప్రజలు మెచ్చే హీరోల్లో కృష్ణంరాజు ఒకరన్నది ఆయనకు నచ్చే పుత్రాలనుబట్టి తెలుసుకోగలిగాను ప్రేక్షకులకు "కృష్ణవేణి, భారతి, బంట్రోతు భార్య" చిత్రాలలోని కృష్ణంరాజు అంటె ఎక్కువ యిష్టం అనికూడా ఆయనకొచ్చే లేఖలు తెలిపాయి

రాబోయే చిత్రాలపైన ప్రేక్షకులు పెద్ద హోప్ పెట్టుకొనియున్నారు శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్ వారి "రక్తపాశం", శుభ చిత్రాలయ వారి "ఆడవాళ్ళు—అపనిందలు", పల్లవి ఇంటర్నేషనల్ వారి "ఇద్దరూ యిద్దరే", రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్ వారి "పెళ్ళికాని తల్లి" చిత్రాలలో కృష్ణంరాజు వైవిధ్యం వున్న పాత్రలను పోషిస్తున్నారు గనక, ఆయన అభిమాన ప్రేక్షకులు ఆనందపడగలరనడంలో సందేహంలేదు

మంచి పాత్రలను మాత్రమే చేద్దామనుకునే నిర్ణయాన్ని కృష్ణంరాజు తీసుకొన్నారు రాజుగారి భవిష్యత్తు బలేగా వుండగలదు



"పూజ"లో ఒక దృశ్యం



"ముత్యాల ముగ్గు"లో రావు గోపాలరావు

## "కౌముదిలో నటసామ్రాట్ !"

ఉత్తమ అభిరుచులున్న కొద్దిమందిలో కౌముదీ అధినేత ఒకరు. శ్రీ ఎమ్. ఎస్. రెడ్డి నిర్మించిన చిత్రాలలో క్వాలిటీతోబాటు ఆయన శ్రద్ధ, శ్రమ కనిపిస్తుంది.

"మల్లెమాల" సుందర రామిరెడ్డిగారికి, అక్కినేనిగారితో "వేమన" తీయాలన్న తలంపు ఏర్పడి ఒక ఏడు దాటింది.

# సినిమా

ఈ మధ్య ఎమ్. ఎస్. రెడ్డిగారు, "నటసామ్రాట్"ను పవేరాలో కలిసి, తన గృహానికి ఆహ్వానించారు.

అప్పుడు యిద్దరూ పరస్పరం సంభాషించుకుని, ఒక నిర్ణయాన్ని తీసుకొన్నారు. అదేమిటన.

సంవత్సరానికి ఒక చిత్రం తనకు చెయ్యడానికి, నాగేశ్వరరావుగారు అంగీకరించారన్న రెడ్డిగారి వార్తను అక్కినేని ధృవపరిచారు. గుడ్ కాంబినేషన్ !

### ఇద్దరి మేధావుల కలయిక

మొదట్లో సాంఘిక చిత్రంలో నటించడానికి అక్కినేని సమ్మతించారు. 1976లో షూటింగు జరుగగలదు.

తరువాత "ప్రజాకవి వేమన" చిత్రాన్ని నిర్మించడానికి "రెడ్డి—రావు"లు నిర్ణయించారు.

### సుందరం మూవీస్ జానపదం

"మల్లెమాల" సమర్పించే జానపదం త్వరితంగా తయారు అయ్యేందుకు సిద్ధమవుతూ వున్నదని, సుందరరామిరెడ్డి చెప్పారు.

ఈ జానపద కథకు రామకృష్ణ నాయకుడు. కథ, మాటలను రెడ్డిగారు రాశారు. అగ్రశేణి తారాగణం ముఖ్య పాత్రలను పోషించగలరు.

— శ్రీనివాస్




# యుగసంధి

(23 వ పేజీ తరువాయి)

"అదే జరుగుతోంది వచ్చేవారూ వెళ్ళేవారే కానీ ఏ ఒక్కరూ మాధవిని చేసుకుంటాననటంలేదు. గోపాలు మాధవిని చేసుకుంటానంటే మాధవి ఒప్పుకోవటం తప్పేం ఉంది ? కానీ తాతగారూ నాన్నగారూ బాబయ్యా అందరూ అది ఏదో పాపం చేసినట్లు అనుకుంటున్నారు. దాన్ని మెడ్రాసులో ఇంట్లోనే ఖైదీగా చేసాడు బాబయ్య — భోజనంకి కూడా క్రిందకి రాకూడదు అని ఆజ్ఞ ఏవో సంబంధాలు చూస్తున్నాట్ట ఏదో ఒకటి చూసి చేసెద్దామని అభిప్రాయం అని తెలుస్తోంది."

"ఛా ! ఎంత తప్పు చేస్తున్నారు ! దాని కిష్టమైన పిల్లాడినిచ్చి చెయ్యకుండాను. సుందరం ఇదేకాదు మనింట్లో ఇంకో ఆలజడీ రేగుతుందనుకుంటాను. సుజాత ఎవరో మళయాళీ పిల్లాడిని చేసుకోవాలని నిశ్చయించుకున్నట్లు ఉత్తరం వ్రాసింది. శ్రీనుకి స్నేహితుడు. నేను చూసాను. నా కాలేజీ పిల్లలతో వెళ్ళానుకదా అప్పుడు పిల్లాడు మంచివాడేను. తెలుగువాళ్ళలాగే మాటతీరూను కానీ పిన్ని ఒప్పుకుంటుందంటావా ?"

"ఉహూఁ! మనవాళ్ళు కలకత్తా కాదుకదా అమెరికా వెళ్ళినా పైకి కబుర్లు చెప్పినా తమదాకా వస్తే యిలాంటివాటికి ఒప్పుకోరు."

"నాకది వ్రాసింది. ఏం చెయ్యనూ అని."

"జవాబు వ్రాయి. పరీక్ష లయ్యేంతవరకూ అవసరపడవద్దనీ అప్పటికీ అదే అభిప్రాయం వుంటే అప్పటి సంగతి చూసుకోవచ్చుననీ. నీకు తెల్సుకదా శ్రీను యింగ్లీషు లిటరేచరు తీసుకుంటానంటే అత్తయ్య ఎంత దెబ్బలాడిందోను. ఇంజనీరింగే చదవాలని. ఈ పెద్దవాళ్ళకి ఇంజనీర్లూ, డాక్టర్లూ కాకపోతే చదువుకాదు. కాకపోతే ఐయేఎస్సైనా చదవాలి. వాడికి సాహిత్యమంటే యిష్టమయితే వాడిని ఇంజనీరింగు చదవాలని దెబ్బలాడి చదివించింది తనమాటే నెగ్గించుకుంది సుజాత లెక్కలు తీసుకుంటానంటే వద్దని సైన్సు తీసుకోమని పేచీపెట్టి సైన్సులోనే చేర్పించింది. ఇప్పుడుమాత్రం సుజాత మాట వింటుందా. అందులోనూ మళయాళం అంటే మనవాళ్ళు ఒప్పుకోరు గోపాలునే వద్దంటున్న మన పెద్దవాళ్ళు దీనికి ఒప్పుకుంటారా ఎన్నటికీ ఒప్పుకోరు."

"అయితే ఈ పెళ్ళి జరుగుతుందా."

"జరగటం జరగకపోవడం సుజాతా శ్రీనుల చేతుల్లోనే వుంది వాళ్ళిద్దరూ ఎలా ఆలోచించుకుంటారో. అత్తయ్యా మావయ్యలని ఒప్పించగల్గితే అందరికీ మంచిది."

తండ్రి వస్తున్నది చూసి సుందరం, రామంతో క్రిందకి వచ్చేసాడు మరునాడు పెందరాడే లేచి తలంటుస్నానం చేసారు నరకచతుర్దశీ దీపావళీ హడావుడిగా గడిచిపోయాయి. మాలతిని దీపావళి నాడు రాత్రి ఒంటరిగా చూసాడు సుందరం. సుందరానికి మాలతిని చూసినపుడల్లా కడుపులోంచి ఏదో వేదన. ఇంకా ఎన్నాళ్ళిలా ? నల్చురితో మాట్లాడదు. నవ్వటమే మానేసింది మొగుడన్న వాడిని ఎరుగదు కానీ పోయాడనగానే అలంకారాలన్నింటినీ నిషేధించేసరికి ఒప్పుకుని అలాగే నడుచుకుంటోంది. రేపు తనకి పెళ్ళయి పెళ్ళాం యింటికొస్తే తన ఈడు ఆడపిల్ల నగలూ అలంకారాలతో తిరుగుతూంటే మాలతికి బాధగా వుండదూ ! ఆ ముఖాన్ని చాదుబొట్టు పెట్టుకుంటే ఎంత కళగా వుంటుంది. అయ్యబాబోయ్ తాతగారు నిలువునా నరికెయ్యరూ. అనుకున్నాడు సుందరం.

రామంకూడా లోపలకి వచ్చాడు. రామానికి మాలతంటే చాలా యిష్టం. రామానికి జ్ఞానం వచ్చేసరికి మాలతికి పెళ్ళి అయి, భర్తపోయి తాతగారింటే వుండటానికి వచ్చేసింది. కార్యమన్నా జరగలేదు. ఊరికే శ్రావణమాసం నోములకని వెళ్ళనది భర్త పోయేసరికి శాస్త్రిమావయ్య వెంటబెట్టుకు వచ్చేసారు. ఆనాటినుంచీ మాలతిని చూసినపుడల్లా రామం మనస్సు వేగంగా కొట్టుకుంటుంది కానీ రామంకి మాలతితో ఆట్టే మాట్లాడ్డానికికూడా భయం ఇప్పుడు మాలతి చీరలు కట్టుతోంది. పెద్దదయింది కానీ ఇంకా ఆట్టే బయటి ప్రపంచం తెలవదు. మాలతితో మాట్లాడుతుంటే మావయ్యగానీ తాతగారుగానీ వస్తే కన్నెర్రచేస్తారు. కేకలువేస్తారు. ఆడపిల్లలు వయసొచ్చాక పరాయి మొగాళ్ళతో మాట్లాడటం కూడదుట. స్వంత చుట్టాలయినా ఏదో కాస్త పలకరించడం తప్ప ఎక్కువ మాట్లాడ్డకూడదని వాళ్ళ అభిప్రాయం అనవసరంగా రెచ్చకొట్టడం ఎందుకని రామం మాలతితో మాట్లాడాలనివున్నా మనస్సుని అదుపులో పెట్టుకుంటాడు. కానీ ఆ మనస్సు మాత్రం మాలతిని పదే పదే చూడమంటుంది. మాలతినే కోరుతుంది

( ఇంకా వుంది )




"ఇటువంటి ఉత్తరాలు నీకు రావటం నాకిష్టం లేదు" అన్నాను ఇంచుమించుగా ఆ ఇన్‌లాండు కవరును నలిపి బల్లపై గిరాటువేస్తూ.

"ఎటువంటి ఉత్తరాలేమిటి ?" అంది స్వప్న కొద్దిగా భ్రుకుటి ముడివేస్తూ.

"కాకపోతే ఏమిటీ ఉత్తరం ? ఇదేనా ఉత్తరం వ్రాసే తీరు ?"

"ఏ తీరులో ఉందేమిటి ?"

"ఎన్ని చదువులు చదివితేనేం. సంస్కారం లేక పోయాక."

"అతని సంస్కారాని కేమొచ్చిందిప్పుడు ?"

"అసలు నీ వీ ఉత్తరం చదివావా అని!"

"మీ ముందరేగా చదివింది ? నేను చదువు తున్నప్పుడేగా ఎక్కడినుంచి ఉత్తరం అని మీ రడిగింది ?"

"అదే అడుగుతున్నాను. తొందరలో పూర్తిగా చదివావా అని."

"చదవటాని కేముంది ? గోపాలం అమెరికా నుండి వచ్చాడు. మా ఊరు వెళ్లాడు. తిరిగి అమెరికాకు పోతున్నాడు. వీలయితే పాలం ఏర్ పోర్టులో కలుసుకోమన్నాడు."

"అంతేనా ?"

"ఇంకేముంది ? నన్ను చూచి చాలరోజు లయిందన్నాడు. కాస్సేపు నాతో గడపాలనుం దన్నాడు."

"అంతేనా ?"

"ఏమిటి మీ చాదస్తం. అంతగాక ఇంకే ముంది దానిలో" చర్రున లేచి కుర్చీ బర్రున జరిపి కాళీ టీ కప్పులు సింక్ వద్దకు పట్టుకుపోయింది స్వప్న.

నాకు ఒళ్లు మండిపోతోంది. నాది చాదస్త మట. గోపాలం వ్రాసిన ఉత్తరం చదివి కూడా తను ఇంత కూల్‌గా ఉందంటే నా కాశ్చర్యంగాఉంది. లేక నన్ను ఫూల్‌ను చేస్తోందా ? ఆ ఉత్తరం చదవగానే ఆమె ముఖం వికసించింది. "ఎన్నాళ్ల కెన్నాళ్లకు. ఏడేండ్లయింది గోపాలాన్ని చూచి. ఇప్పుడు ఎంత మారిపోయి ఉంటాడో" అంది. "గోపాల మెవరు ?" అన్నాను. "నా బాల్యమిత్రు డండీ. ఒకసారి మీతో చెప్పాను కూడాను అతను అమెరికాలో ఉంటున్నట్టు" అంది. అవును. మా కబుర్లలో రాని విషయా లేవీ లేవు. కాని కబుర్ల లోని వ్యక్తి ఈ విధంగా సాకారంగా ఉత్తరం వ్రాసి తనను పాలంలో కలుసుకో మనటం. ఈమెగారు సంతోషించటం ... అందులో ఆ ఉత్తరం వ్రాసిన తీరు ఎంత పొగరుమోతుగా ఉంది! నేనుకాబట్టి ఊరు కొన్నాను. ఇంకొకరయితే గోపాలాన్ని పాలంకు వెళ్లి చితకతన్ని ఉండేవాళ్ళు. పెళ్ళయి చక్కగా కాపురం చేసుకొంటున్న పిల్లకు ఇటువంటి ఉత్తరమా వ్రాయవలసింది ?

స్వప్న కప్పులు వంటింట్లో పెట్టి తిరిగి వచ్చింది. "ఏమిటి ఇంకా అలా కూర్చున్నారు. ఈరోజేమైనా వంటలో సాయపడేదుందా లేదా ? ఆఫీసులో పనెక్కువయిందేమిటి? వంటయిన తర్వాత అలా తిరిగొద్దాం సరేనా ? ఏం కూర చెయ్యను ? కాలిఫ్లవరుంటే మీ కింకేమీ అక్కర్లేదుకదూ. పోనీలే కూరగాయల అన్నం చేసేస్తాను. అదయితే కూరతో పనిలేదు. బటాణీకాయలు తెస్తాను. కబుర్లు చెబుతూ ఒలుచుకోవచ్చు" అంటూ లోపలికి పోయింది. ప్లాస్టిక్ బుట్టలో మటర్, గోబీ, క్యారెటు పట్టుకొచ్చింది.

"మీరు ఈ కాయలు ఒలిచేయండి. ఇంతలో క్యారెట్ తరుగుతాను. అలసటగా ఉంటే వెళ్ళి పడుకోండి నేనే ఒలుచుకొంటాను. కొంచెం రేడియో

# అర్థాలే వేరులే

పెట్టరూ ప్లీజ్. వివిధ భారతిలో తెలుగు పాటలు వచ్చే వేళయింది.''

నేను యాంత్రికంగా వెళ్ళి రేడియో ఆన్ చేసి వచ్చాను మటర్ ఒలచటానికి కూర్చున్నాను, స్వప్న ఏదేదో మాట్లాడుతోంది. తన ఆఫీసు కబుర్లు చెబుతోంది తన కొలీగ్ జైన్‌కు కొడుకు పుట్టాడట ఈ ఆదివారం పార్టీ అట. నన్నుకూడ తప్పక తీసికొని రమ్మన్నాడట. నేనేమీ మాట్లాడక పోవటం చూచి తన కబుర్లాపేసింది.

''ఏమిటంత మౌనంగా ఉన్నారు ఏదో ఆలో చిస్తున్నారు నాకు చెప్పటంలేదు. ఇదిగో ఇన్ని కాయలు వొలిచారు ఒక గింజయినా కనపడదే మీతో పెట్టుకొంటే ఈ రోజు ఈ వంట అయినట్లే.''

తియ్యని బటాణీ గింజలు నములుతున్న నా నోరు టక్కున మూతబడింది అక్కడినుండి లేచి వెళ్ళిపోయాను. పక్కమీది పడుకొన్న నా బుర్రలో ఆలోచనలు తేనెటీగల్లా తిరుగుతున్నాయి. వంటింట్లో స్వప్న తిరుగమోత పెట్టటం తెలుస్తూనే ఉంది. కమ్మని గుబాళింపు నా నోరూరిస్తోంది కాస్సేపటికి స్వప్న వచ్చి మంచంపై కూర్చుంది.

''తల నొప్పిగా ఉందా'' అంది జుట్టులోకి వేళ్ళు పోనిస్తూ.

లేదని తల ఊపాను.

''ఇంకో పదిహేను నిముషాల్లో నా పని పూర్తవుతుంది తర్వాత బయటకు వెళ్దాం మీరు కూడ లేచి మొహం కడుక్కోండి ''

* * *

ఇంకా చీకటి పడలేదు మార్చి నెల వచ్చిందేమో చలికూడ తగ్గింది మా ఇంటి దగ్గరే ఉన్న చిన్న పార్కుదాకా నడచి వెళ్ళాం పచ్చికలో కూర్చున్నాం చుట్టూ రంగురంగుల పూలు వసంతకన్య అలంకరించుకొన్నట్లున్నాయి ఎదురుగా నీళ్ళు వదలని ఫౌంటెన్ పైన నీలాకాశం చుట్టూ పచ్చదనం నవ్వుతున్న పూలబాలలు చాలా శృంగారాత్మకమైన వాతావరణం కాని మనసే చికాకుగా ఉంది

గోపాలం విషయం తిరిగి స్వప్నే మొదలు బెట్టింది ''మావి ప్రక్క ప్రక్క ఇండ్లే. ఒకే బడిలో, ఒకే కాలేజిలో చదువుకొన్నాం ఆ రోజుల్లో ఎన్ని కబుర్లో .ఎన్ని జోకులో .ప్రతిదీ జోక్‌గా చేసి మాట్లాడుతాడు. నా నవ్వుకు పట్టపగ్గాలుండేవికావు తను బి. యస్ సి. కాగానే బెంగుళూరు వెళ్ళాడు. ఆ తర్వాత ఫారిన్ అక్కడే ఉద్యోగం దొరికింది కూడా. ప్రతి ఏడూ విధిగా గ్రీటింగ్సు పంపుతాడు. ఉత్తర పత్తరాలు తక్కువ. భలే ఫ్యాషనబులుగా ఉంటాడులే ఆ రోజుల్లోనే సిటీ లైఫంటే మోజుపడే వాడు. ఇప్పుడు ఇంకెంత స్టైలుగా ఉంటాడో. మొన్న ఇంటికి వెళ్ళినప్పుడే తెలిసుంటుంది అతనికి నా పెళ్ళిగురించి. ఇంటి దగ్గర అడ్రసు తీసుకొని ఉత్తరం వ్రాశాడు.''

''ఘనకార్యం చేశాడు'' అన్నాను.

స్వప్న నా మొహంలోకి తదేకంగా చూచింది.

''ఎందుకు మీ కంత కోపం ?'' అంది.

నేను మాట్లాడలేదు.

''అయితే ఎల్లుండి గోపాలాన్ని కలుసుకోటం ఉత్తదే అన్నమాట నన్ను పాలం తీసుకెళ్ళలేరు.''

''నీకు వెళ్ళాలని ఉందన్నమాట. అర్ధరాత్రి ఇరవై కిలోమీటర్లు వెళ్ళి ఆ వి.ఐ.పి. ని కలుసుకోకపోతేనేం ? అంత మేనర్‌లెస్ ఫెలో గాలికూడ నీకు తగలటానికి వీల్లేదు ''

''నిజంగా మీ ధోరణి నా కర్థం కావటం లేదు 'డియర్ స్వప్నా' అని వ్రాశాడనేనా మీరు మండిపడుతున్నారు ? నన్నెప్పుడూ పేరుపెట్టే పిలిచేవాడు ఉత్తరాలింక ఎలా వ్రాస్తాడు? ''

''ఈ వాదోపవాదా లెందుకు ? అతనిని కలుసుకోటానికి వీల్లేదంటున్నాను అపైన నీ ఇష్టం.''

''సరయిన కారణం లేకుండా మీరు పెట్టే నిషేధం నేను ఒప్పుకోను. నిజం చెప్పండి. వాటీజ్ బగ్గింగ్ యూ ? ఒక అబ్బాయి నాకు ఉత్తరం వ్రాశాడని, ఇంకో అమ్మాయి మీతో మాట్లాడిందని అనుమానించే కుసంస్కారం మనకు లేదు. ఇద్దరం ఉద్యోగాలు చేస్తున్నవాళ్ళమే. మీ లేడీ కొలీగ్సు, నా మెన్ కొలీగ్సు మనకు కామన్ ఫ్రెండ్సయ్యారు గోపాలం విషయంలో ఈ వింతధోరణి ఏమిటి చెప్పండి దీనిలో రొమాన్సేమీ లేదు కూడాను.''

''అతగాడు ఉత్తరం వ్రాసినతీరు నచ్చలేదు స్వప్నా ఎంత విదేశాలు తిరిగొస్తేమాత్రం తను పుట్టిన దేశమే మరచిపోయినట్లు, ఆచార వ్యవహారాలు తెలీనట్లు . ...''.

''ఏం వ్రాశాడు ? 'డియర్ స్వప్నా' అనా ?''

''మరీ అంత తక్కువగా అంచనావేయకు నన్ను ఈ నాగరిక ప్రపంచంలో ఉత్తరాలు వ్రాస్తున్న తీరు నాకు తెలియకపోలేదు. కాని ఇతనేం వ్రాశాడో తెలుసా ? ఎల్లుండి అతనికి నీతో డేట్ కావాలట''

''ఏమిటీ?!''

''యస్. మే ఐ హావ్ ఎ డేట్ విత్ యూ'' అని వ్రాశాడు'' అని పళ్ళు బిగించి చెప్పాను.

వీధి దీపాలు వెలిగాయి ఆ వెలుగులో స్వప్న మొహం స్పష్టంగా కనిపించింది తను నవ్వుతోంది

''ఎందుకా నవ్వు ?''

తనేం మాట్లాడలేదు. మడతపెట్టిన శాలువా విప్పితీసి భుజాలమీద కప్పుకొంది.

''మాట్లాడవేం. ఎందుకు నవ్వుతున్నట్లు ?''

''మీ కోపం చూస్తే నవ్వురాదూ కాస్త అమెరికన్ స్లాంగ్‌లో వ్రాశాడు. అంతమాత్రానికే మండిపడితే ఎలా ?''

''అమెరికన్ స్లాంగ్ ఏమిటి నా మొహం ఇతను అమెరికాలోనే పుట్టి పెరిగాడా ?''

''లేదనుకోండి. కాని కొన్నేళ్ళు అక్కడుంటే, అందులో గోపాలంలాంటి వాళ్ళు వారు వీరుగా మారితే ఆశ్చర్య మేముంది ? రండి. రండి ఇక ఇంటికి వెళ్దాం.''

ఇల్లు చేరే వరకు ఏవో అర్థంలేని మాటలు సంగతీ సందర్భం లేకుండా మాట్లాడుకొన్నాం. అన్నాల వేళకు వేడివేడిగా అన్నం వడ్డించింది స్వప్న.

''మీ తలనొప్పి తగ్గినట్లేనా ?'' అంది నవ్వుతూ.

''నాకేం తలనొప్పి లేదు'' అన్నాను కొంచెం కటువుగా. భోజనాల టైంలో ఇంకేం మాటలు సాగలేదు.

ఆ తర్వాత నేనేదో పుస్తకం చదువుకొంటుంటే స్వప్న నా చేతిలోని పుస్తకం తీసి అవతల పెట్టింది. 'డేట్' అనే మాటకు అంత ఉడుక్కోటమెందుకు?'' అంది.

''స్వప్నా! ఏమీ తెలీనట్లు మాట్లాడకు. కాలేజి చదువులు చదివిన ఆడపిల్లకు 'డేట్' ఏ అర్థంలో వాడుతారో తెలీకపోదు. మీ హాస్టల్సులో ఎప్పుడూ ఈ విషయమై ఎవరూ జోక్ చేసుకోగా వినలేదా ?''

''ఆడపిల్ల తన బాయ్‌ఫ్రెండుతో వెళ్ళటాన్ని 'డేట్' అంటారనేగా మీ ఉద్దేశం ?''

''అవును. అదిగాక ఇంకేమైనా పవిత్రమైన అర్థం ఉందేమిటి?''

స్వప్న నవ్వు తళుక్కున మెరిసింది. రెప్పపాటు కాలంలో ఛాంబర్స్ డిక్షనరీ నా కళ్ళముందు తెరిచింది. డేట్ అనే పదంవద్ద వేలుపెట్టి చూపించింది నవ్వుతున్న తన కళ్ళలోకి చూడలేకపోయాను

''అమెరికన్ స్లాంగ్‌తో నాకేం పని'' అంటూ డిక్షనరీ మూసేశాను.

''ఇప్పుడయినా గోపాలాన్ని కలుసుకోటానికి పాలమ్ విమానాశ్రయానికి తీసుకెళ్తారా ? ''

''ఈ విషయాలేవీ అతనితో చెప్పకేం'' అన్నాను. గలగలా నవ్వింది స్వప్న



# వారఫలం

మహేష్

4-7-1975 శుక్రవారం మొదలు
10-7-1975 గురువారం వరకు

**మేషం :—** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. రావలసిన డబ్బు అందుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోష కరమైన వార్తలను వింటారు.

**వృషభం:—** మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. మీ ఆలోచనలు ఫలించగలవు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మిధునం:—** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రాగలదు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ఉద్యోగంలో శ్రమ కలుగు తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహ కరంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో వ్యతిరేకమైన వార్తలను వింటారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**సింహం :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు— దైవ కార్యాలు నెరవేరతాయి. నూతన విషయాలను తెలుసుకొంటారు.

**కన్య :—** వ్యాపారంలో అనుకూలమైనవార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**తుల:—** చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. సాహసిక వ్యవహారాల్లోనే నష్టం రాగలదు. ఆందోళనకు గురి కాగలరు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా వుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది వినోదకార్యక్రమాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం ఆఖరులో అనవసరమైన శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**ధనుస్సు :—** వ్యాపారంలో పోటీవారి పోటీ పెరుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మకరం :—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో అనవసరమైన సందేహాలుకలుగుతాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కుంభం :—** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. పోటీ వారిలోగౌరవం లభిస్తుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. విద్యావైజ్ఞాని రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు— పుణ్య కార్యాలు చేస్తారు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం:—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.



హైదరాబాద్ సచివాలయ సాంస్కృతిక సంస్థ నిర్వహించిన తెలుగు సాంస్కృతిక వారోత్సవాలలో 'నాన్నా పులి' అన్న నాటికలో చెల్లప్పగా నటించి ఉత్తమనటుని బహుమతి ం[illegible]కున్న యువకుడు కె. పద్మనాభస్వామి.




మా అమ్మమ్మకి కోపం వచ్చినప్పుడల్లా "కాశీ వెళ్లిపోతా" అంటూ బెదిరిస్తుంది మధ్య.

అంటే 'చావటానికి పోతా' అని.

మా తాతయ్య కాశీలోనే పోయాట్ట.

ఆమె కాశీయాత్ర మా అమ్మ, నాన్నలకు ఏమాత్రమూ ఇష్టంలేదు.

కాశీలో దేహాన్ని చాలిస్తే పుణ్యలోకాలు ప్రాప్తించే మాట నిజమే. కాని కూతురు, అల్లుడు వుండి గూడా దిక్కులేని చావు చావడం ఎందుకు? అని అమ్మ వాదిస్తుంది.

"పాపం చేసుకున్న వాళ్ళు కాశీలో చచ్చినా నరకం తప్పదు" అంటారు నాన్న.

"మీ రంతా ఉండగా దిక్కులేని చావు ఏం ఖర్మ." అంటుంది అమ్మమ్మ.

అమ్మకు కోపం వస్తుంది. "అయితే నీ వెంట మేంగూడా కట్ట కట్టుకుని కాశీకి వచ్చి నువ్వెప్పుడు పోతావో ఎదురు చూడ మంటావా?" అంటుంది.

అమ్మమ్మకు రెట్టింపు కోపం వస్తుంది గాని ఏం మాట్లాడదు. అయితే మాటి మాటికీ కాశీ పోతానని బెదిరిస్తుందే, ఆవిడకు కాశీ పోడానికి రైలు చార్జీలున్నాయా? పోనీ టిక్కెట్టు లేకుండా రైలెక్కి పోతుం దే అనుకుందాం! అక్కడ పూట గడవడానికైనా ధనము కావలయును గదా? ఆవిడ వద్ద ధనం వుందా?

ఈ అనుమానానికి ఆస్కారమేలేదు. ఈ మధ్యనే కొండాపురంలో వున్న పాత ఇల్లు విక్రయించిన బాపతు వెయ్యి రూపాయిలు ఆవిడదగ్గరే వున్నాయి. ఊరికే వుంటే పిల్లలు పెడుతుందా ఏం? అని మా వీధిలోనే వున్న అవధాని అనే పెద్దమనిషికి వడ్డీకిచ్చింది. ఎప్పుడడిగితే అప్పుడిస్తానని ప్రాంసరీ నోటు రాసిచ్చాడాయన.

ఆ వెయ్యి రూపాయిల బాక్‌గ్రౌండే అమ్మమ్మ చేత కాశీయాత్ర...కాశీయాత్ర... అనిపిస్తుందని అమ్మా, నాన్న అనుకోవడం నే ననేకసార్లు విన్నాను. అంతేకాదు ఆ అవధాని గాడు వడ్డీయిచ్చి అసలు ఎగ్గొడితే బాగుండును అని గూడా మా అమ్మ అంది. "నీ మాటలు అవధాని వింటే అదే జరుగుతుందని" నాన్న అన్నారు.

"నువ్వీమాట అన్నావని అవధానికి చెప్పి రానా అమ్మా!" అన్నానని అమ్మ నా నెత్తిన ఒక మొట్టికాయ మొట్టింది.

సరేలే పెద్దవాళ్ల వ్యవహారంలో నా జోక్యం ఎందుకని నోరు మూసుకున్నాను.

నిజానికి అమ్మమ్మ పోతే (కాశీకి) నాన్నకి నష్టంలేదు (కాస్త లాభం గూడా. ఈ కరువు రోజుల్లో ఒక మనిషి తిండి మిగుల్తుంది) అమ్మకి మాత్రం చాకిరి నెత్తిన బడుతుంది. తెల్లవారు జామున లేచి స్నానం చేసి మడి కట్టుకుని వంట మొదలు పెట్టాలంటే మా అమ్మ వల్ల కాదు. సూర్యుడు రాకుండా నిద్ర లేవనని మా అమ్మ వ్రతంట. (మా అమ్మకు వంటచేయడంరాదని నా అనుమానం.)

అమ్మమ్మ కాశీ వెళ్లి పోయేట్టు చేయమని నేను మాత్రం ఆ కాశీ విశ్వేశ్వరుడ్ని, అన్నపూర్ణమ్మ తల్లిని వేడుకుంటూంటాను

అయితే ఆవిడ కాశీలో ఇహలోక యాత్ర చాలించి, స్వర్గలోకం పోవాలని నా వుద్దేశ్యం కాదు. నరకం పోయినా నా కిష్టమే

మరలాంటప్పుడావిడ కాశీ పోతే నీకేం? పోక పోతే నీకేమని మీ రడగొచ్చు ఆవిడ ఇంట్లో లేకుండా పోవడమే నా క్కావల్సింది.

ఆవిడ నా పాలిట విలన్ అన్నా సరిపోదు. మా అమ్మా, నాన్నా పట్టించుకోని విషయాలన్నింటిలోనూ తగుదునమ్మా అనొచ్చి తల దూర్చుతుందీ ముసలిమటం

ఆడ పిల్లలు సర్దాలన్నీ తీర్చుకొనేది ఎప్పుడు? పెళ్లికాకముందే గదా?

మా అమ్మమ్మ మూలంగా నాకే సర్దాలు తీరడం లేదు ఖర్మ.

మా ప్రక్కింట్లో ఇన్కమ్‌టాక్స్ ఆఫీసర్ గారమ్మాయి టెర్లిన్ షర్టూ, బెల్ బాటమ్ ప్యాంటూ కుట్టించుకుంది.

నాకూ అలాంటివి కావాలని మా అమ్మతో అన్నానో లేదో తెయ్యిమని ఇంతెత్తు ఎగిరింది మా అమ్మమ్మ.

"పదిహేనేళ్లొచ్చా క్కూడా పమిటల్లేకుండా ఎంటా వెధవ డ్రస్సు, వెధమ్మ డప్పులు... సిగ్గుండాలి మొహాలకి. ఆ పేసుకునే వాళ్ళకి

సిగ్గు లేకపోతే కుట్టించినోళ్ళగ్గూడా లేదా? అవ్వ! మన ఆచారాలేంటి మనదేశ మేంటి, పదకొండో యేడు రాగానే పమిటలేసుకోవాలి గాని. 'ఛీ...కాలం మండి పోతుందే!...సేవ్ వాణీ! ఇక ఆ ప్రక్కింటి వాళ్ళు చూసేత్తా వంటే నీ కాళ్ళు విరగ్గొట్టి మూల కూర్చో బెడతా!''

ఆవిడ అంతటితో ఆపలేదు. ఇటు ఇంగ్లీషోళ్ళనీ, అటు ఆచారాలు పాటించనోళ్ళనీ శాపనార్థాలు పెడుతూనే వుంది.

ఒక రోజు ఇన్కమ్‌టాక్స్ ఆఫీసరు గారమ్మాయి నేనూ ఆరుబైట కూర్చుని కారమ్స్ ఆడుకుంటుండగా వాళ్ళ అబ్బాయి వేణు తనూ ఆడతానని కూర్చున్నాడు

ఆ దృశ్యం మా అమ్మమ్మచూసి గావుకేక వేసింది నాకు అలవాటుకాబట్టి సరిపోయింది గాని ఆ కేకవిని పిడుగు పడినంత భయపడి ఇంట్లోకి పారిపోయారు వాళ్ళిద్దరూను.

''అవ్వ! మగపిల్లల్తో ఆటలేంటీ సిగ్గు లేని దానా? ఎవరైనా చూస్తే కొంపలంటుకు పోవూ? చూసినోళ్ళు మా మొఖాల మీద వుమ్మేయ్యరూ! అసలు నిన్నని ఏం లాభం? నిన్ను బడికి పంపించిన మీ అమ్మననాలి గాని. అందుకే 'ఆడ పెత్తనం తంబల దొరతనం' అన్నారు. మన ఇంటా వంటా వుందా ఇలా బరితెగించడం. అసలు నీకు పెళ్లియోగం వుందో లేదో?''అంటూ లంకించుకుంది.

ఇక స్కూలునుంచి ఒక్క పది నిమిషాలు ఆలస్యంగా వచ్చానా? వచ్చానన్నమాటే.

''ఎక్కడెక్కడ పెత్తనాలు చేసుకుంటూ వస్తోంటో మహారాణి! రామ్మా!... రా! లమ్మాయ్! నీకూతురు చదివి ... చదివి అలిసిపోయి వచ్చిందేవ్! కాస్త ఫలహారం పెట్టి, కాఫీ ఇవ్వు ...'' అంటుంది.

అసలు నేను చదువుకోవడం మా అమ్మమ్మకు ఇష్టమేలేదు.

''పెద్దమనిషైనాక ఆడపిల్లలకి చదువు లెందుకే. ఎంతచదివినా పెళ్ళిచేసుకోక తప్పుతుందా? చదువు మాన్పించి వంటా అదీ నేర్పు ... ఒకటి రెండేళ్లలో మంచిసంబంధం చూసి పెళ్ళిచేద్దాం.'' అంది మా అమ్మతో.

అందుకు మా అమ్మ ''పదమూడేళ్ళకే పెళ్ళేమిటే అమ్మా! ఇప్పుడెవరూ అలా చెయ్యడం లేదు. పైగా గవర్నమెంటు రూలుంది గూడాను. చెయ్యగూడదని. చదువుకోనీ ... ఇప్పుడేం తొందర.'' అంది.

''ఆఁ... రూలుందిలే రూలు ఆ రూళ్ళు మండిపోబట్టే పెళ్ళికాకుండానే ముసలమ్మలై పోతున్నారు ఆడపిల్లలు.'' అని గొణుక్కుంది అమ్మమ్మ.

ఎప్పుడు వీలుదొరికితే అప్పుడు నా చదువు మీద దండయాత్ర చేసేది. స్కూల్లో ఫంక్షన్ కయినా అమ్మ తోడువస్తేనే గతి. లేకపోతే పోనిచ్చేది కాదు.

నా తోటిపిల్లలు స్వతంత్ర భారతంలోని పౌరుల్లా సర్వ స్వాతంత్ర్యాలతోటీ సంచరిస్తూ వుండేవాళ్ళు. విడుదలైన రోజునే సినిమా చూడకపోతే షేమ్‌ఫీలయ్యి స్కూలుకుపైతం ఎగనాంపెట్టి వెళ్ళిపోయేవాళ్లు. ఇక శత దినోత్సవాలకి సినిమాతారలొస్తే వాళ్ళు మకాంచేసిన బంగళా చుట్టూ పహరా ఇచ్చేవాళ్ళు. ఎప్పుడైనా సినిమా షూటింగ్ జరిగితే అన్నిరోజులూ స్కూలుముఖం చూసేవాళ్ళు కాదు. అంతేనా! నా క్లాస్‌మేట్సు వనజ, గిరిజ, కమల, విమల, జయశ్రీ, రాజశ్రీ వాళ్ళంతా మగపిల్లల్తో పోటీగా ఫాషన్స్ మార్చేసేవాళ్ళు. పారిస్‌నుంచి బొంబాయి. బొంబాయినుంచి మా స్కూలుకు వచ్చేసేవి ఫాషన్స్ వాళ్ళయితే రాత్రిళ్ళు లుంగీలే వాడతారట. లంగా, వోణీలు వేసుకునే నన్ను చూసి పల్లెటూరి మొద్దువనీ, బి సి నాటి అమ్మమ్మవనీ ఎగతాళి చేసేవాళ్ళు.

మా అమ్మమ్మ మూలంగా నాకు వాళ్లతో ఎగతాళి చేయించుకునే ఖర్మ పట్టిందిగాని లేకపోతే నేనూ వాళ్ళతో సమానంగా వుండే దాన్ని గానా?

ఇక నాకు మా అమ్మమ్మ కాశీయాత్ర పోతే బాగుండును అనిపించడంలో న్యాయం లేదూ!

నాకిప్పుడు కోరికలేం లేవు. ఒకే ఒక కోరిక. అమ్మమ్మ కాశీ పోవాలి. ఆవిడ కాశీ పోవడం, ఇంగ్లీషువాళ్ళు ఇండియా వదిలి పోవడంలో సమానం నాకు.

ఈమధ్య మా పక్కింట్లో ఆఫీసరుగారి తల్లి శాంతమ్మగారు చిన్నకొడుకు దగ్గర్నుంచి పెద్ద కొడుకు దగ్గర కొచ్చింది.

పేరుకు తగ్గట్టే ఆవిడ శాంతమూర్తి.

మధ్యాహ్నం పూట మా అమ్మమ్మ, శాంతమ్మగారు పిచ్చాపాటీ మాట్లాడుకునే వారు అయితే ఇద్దరు అభిప్రాయాలు ఒకటి కాదు. శాంతమ్మగారు పాతకాలపు మనిషే అయినా కొత్తకాలం గురించి పట్టించుకునేది కాదు. మా అమ్మమ్మ ఏదైనా అంటే ''ఇద్దరూ పిల్ల కుంకలు ముచ్చట పడుతున్నారు.'' అనో ''కాలం మారిపోయింది లెండి మన కాలం వేరు''అనేది.

శాంతమ్మగారికి పూలమొక్కలంటే చాలా ఇష్టం. నర్సరీ నుంచి రకరకాల రంగుల గులాబీ మొక్కలు, ముద్దమందార, చామంతి కనకాంబరాలు, లిల్లీ, నందివర్ధనం మొక్కలు తెప్పించి నాటించింది. మల్లె, సన్నజాజి తీగలు పందిరికి పాకించింది. కుదుళ్ళు చేయించి ఎరువు వేయించింది.

నెల తిరిగిందో లేదో గులాబీలు మొగ్గలు తొడిగాయి. ముద్ద మందారాలు పసిపాపల బోసినోళ్ళలా ఎర్రగా విచ్చుకున్నాయి. లిల్లీ పువ్వులు, ఘుమ, ఘుమ సువాసనలు వెదజల్లాయి. నందివర్ధనం ఏపుగా పెరిగింది. మల్లె, సన్నజాజి పడగవిప్పుకున్న పాముల్లా పందిరి పైపైకి ఎగబాకాయి.

అదివరకు బోసిగా వున్న వాళ్ళ పెరడు చిన్న తోటగా మారిపోయి కన్నుల పండుగగా వుంది. శాంతమ్మగారు ఎక్కువగా ఆ తోటలోనే కన్పించేది. వాళ్ళ జవాన్‌తో పాదులు తీయిస్తూనో, నీళ్ళు పోయిస్తూనో వుండేది.

ముద్దమందారాలు రెండుకంటే ఎక్క వ

### కీర్ పకోడి

కావలసిన వస్తువులు : తోటకూర—5 కట్టలు, సెనగపిండి — అర కిలో, ఉల్లిపాయలు—300 గ్రాములు, అల్లం — చిన్న ముక్క, జీలకర్ర—ఒక చెంచా, పచ్చిమిర్చి—పదారు, ఉప్పు— తగినంత.

**తయారుచేయు విధానము :** మొదట తోటకూరను కడిగి, శుభ్రం చేసి, సన్నగా, చక్కగా తరుగుకోవాలి. తరువాత ఉల్లిపాయలూ, అల్లమూ, పచ్చి మిర్చీ, కూడా సన్నగా, చిన్న చిన్న ముక్కల్లా తరుగుకుని, వాటిని శుభ్రం చేసిన సెనగ పిండిలో వేసి, జీలకర్రా, తగినంత ఉప్పూ తరిగిన తోటకూర కూడా వేసి, కొద్ది కొద్దిగా, నీళ్లుపోస్తూ, మెత్తగా, గట్టిగా, తడిపెట్టుకోవాలి. తర్వాత, దీనిని కాగుతున్న నూనెలో, చిన్న చిన్న పకోడీలలాగా, వేసి ఎర్రగా దోరగా వేయించుకోవాలి. ఈ 'కీర్ పకోడీలు' చాలా రుచిగా వుంటాయి.

—జి. రామలక్ష్మి

## అమ్మమ్మ కాశీయాత్ర

విచ్చితే వాళ్ళమ్మాయి నాకూ ఒకటి యిచ్చేది. ఒక పువ్వువాలు తలనిండా సరిపోయేది. ఇక ఆరోజు మాచెల్లాయి గొడవ, గొడవ చేసేది. దానిపోరు భరించలేక ఆ పువ్వు దానికే యిచ్చేసేదాన్ని.

మా అమ్మమ్మకు శాంతమ్మగారు తోట పెంచటం ఎందుకో ఈర్ష్య కలిగించింది. అసూయ ముందుపుట్టి, ఆడది తర్వాత పుట్టిందంటారు పెద్దలు. వాళ్ళకు చెయ్యెత్తి మొక్కాలి.

నేను వాళ్ళ తోటని మెచ్చుకుంటే "ఆ పెం ంది లేవే పెద్ద తోట. మాకూ వుండేది దీని తాతలాటి తోట. అందులో గులాబులు ఇలా వుండేవా? ఒక్కొక్కటీ నాతలకాయంత వుండేది. మల్లెలూ, సన్న జాజులయితే వేలకువేలు పూసేవి. కొయ్యడానికి చేతులు నొప్పిపుట్టేవి." అనేది

మా చెల్లెలయితే "వాళ్ల దొడ్డిలో పూలు పూత్తనయ్యి మన దొడ్డిలో పూత్తలేదు" అనేది అమ్మమ్మతోనే.

అవిడ మండిపడి "పూత్తనయ్యిలే ... మహా" అని చెల్లిని కసురుకునేది.

అసలు సంగతేమిటంటే శాంతమ్మగారికి మా అమ్మమ్మకు ఎందుకో చెడింది. పూర్తిగా మాటల్లేవు.

ఎవరో హైదరాబాద్ నుంచి మంచి గులాబీ అంట్లు తెచ్చి ఆఫీసరుగారికి పంపించారు. వాళ్ల తోటలో చోటు లేకనో లేక పాపం ప్రక్కింటి వాళ్ళుగదా రెండు మొక్కలు ఇద్దాం అనో శాంతమ్మగారు నన్ను పిలిచి "అమ్మాయి వాణీ! ఇదిగో ఈ రెండు అంట్లూ తీసుకెళ్ళి మీ దొడ్లో నాటుకో. ఒకటి బంగారు రంగు గులాబీ. ఒకటి పసుపు రంగుదీ..." అన్నది.

నేను ఎగిరి గంతేసి ఆ రెండు మొక్కలూ ఇంటికి తీసుకెళ్లేసరికి మా అమ్మమ్మ కాళికా అమ్మ వారిలా ఉగ్రరూపం ధరించి వుంది.

"ముందా మొక్కలు తీసుకెళ్లి శాంతమ్మ మొఖాన కొట్టు," అని హుకూం జారీ చేసింది.

"పోనీలే అమ్మా! ఇచ్చినవి ఎందుకు వద్దనాలి." అంది మా అమ్మ.

"ఇచ్చార్లేవే మహా. ఊరకే ఇచ్చారా! అవసలు పూలు పూస్తాయని నమ్మకంలేదు నాకు. ఏ నాసిరకమో? పనికిరాక మన మొఖాన కొట్టారు."

"ఏదో ఒకట్లే. పూల మొక్కేకదా, అమ్మాయి సర్దాపడుతోంది. నాటుకోనీ. పోవే! పో! బాగా త్రవ్వి కాస్త పేడ గుంటలో వేసి నాటు." అంది మా అమ్మ.

ఆ దెబ్బతో మా అమ్మమ్మ నోరు మూత పడింది. కాని గుడ్లు ఉరజేసి నా వంక చూసింది.

ఎల్లాగైతేనేం రెండు మొక్కలూ నాటి నీళ్లు పోశాను.

రోజూ ప్రొద్దునే లేచి వాటికి నీళ్ళు పొయ్యడం, పాదు తియ్యడం నా మొదటి కార్యక్రమం అయ్యింది. వారం గడిచేటప్పటికి చిగురుటాకులు వేసింది. పెంచిన ప్రేమ ఎలాంటిదో నా కప్పుడు తెలిసింది. ఆ మొక్కల కేసి ఎంత సేపయినా అలా చూస్తూవుంటే ఎందుకో కడుపు నిండినట్లు తృప్తిగా వుండేది. అమ్మ నీళ్లు తోడానని కేకలు వేసేవరకూ అక్కడే వుండేదాన్ని.

మరొక వారానికి రెండు మొక్కలూ మొగ్గలు తొడిగాయి. ఆ మొగ్గల్ని చూస్తుంటే నన్ను నేను మర్చిపోయేదాన్ని. ఏదో తన్మయత్వం నన్ను ఆవరించేది. ఎప్పుడెప్పుడు ఆ మొగ్గలు విచ్చుతాయా! అని క్షణ, క్షణం ఎదురు చూసేదాన్ని. క్లాసు రూములో కూర్చున్నప్పుడు కూడా ఈపాటికి సగం విచ్చి వుంటుందా అని వాటి గురించి ఆలోచించేదాన్ని.

ఇక రేపు ఆ మొగ్గలు విచ్చుతాయనగా ఆ రాత్రి బాగా వాన పడింది. ఇక వర్షా కాలం మొదలైందన్నమాట.

రోజూకంటే కొంచెం ఆలస్యంగా లేచాను ఆ రోజు. బాగా మబ్బు పట్టి వుంది. లేచిన కాసేపటికి గాని గులాబీలు విచ్చి వుంటాయని జ్ఞాపకం రాలేదు. పరుగున దొడ్లోకి వెళ్లాను.

ఆ దృశ్యం చూసి నా నవనాడులూ క్రుంగిపోయాయి. భూమి కదిలిపోయినట్లనిపించింది.

గులాబీ మొక్కలు వుండాల్సిన స్థానంలో రెండు గుంటలు మాత్రం వున్నాయి. సగం విచ్చిన మొగ్గలతో పసి పిల్లల శవాల్లా దూరంగా పడివున్నాయి మొక్కలు.

కోపంతో నా వళ్ళంతా కంపించిపోయింది. ఎవరా దారుణ కృత్యం చేసింది.

ఇంకెవరు? నా పాలిట యముళ్ళు

"నేను ఆ ఐదు రోజులు ఎవరి ముందుకూ వెళ్ళేదాన్ని కాదు.



ఇప్పుడు నాకు 'కేర్ ఫ్రీ' సానిటరీ నేప్‌కిన్‌లను గురించి అదృష్టవశాత్తు తెలిసింది మరియు నెలలో 30 పూర్తి రోజులు హాయిగా వున్నాను!"

వండర్‌రాప్‌గల క్రొత్త కేర్‌ఫ్రీ స్త్రీయొక్క దేహమునకు పూర్తి సౌఖ్యమును, పూర్తి రక్షణను యిస్తుంది.

నెలలో ఆ ఐదు రోజులు స్త్రీయొక్క దేహమునకు ఒక ప్రత్యేకమైన రకపు రక్షణ తప్పకుండా కావాలి. ఆ బాధ్యతను తీసుకొనుటకు యిప్పుడు కేర్‌ఫ్రీ ఉంది.

కేర్‌ఫ్రీ యొక్క పై పొరయగు సాటిలేని వండర్‌రాప్ చెమ్మను లోపలి పొరలలోనికి త్వరగా పీల్చుకొంటుంది కనుక మీ చర్మము పొడిగా ఉంటుంది మరియు మీరు సౌఖ్యముగా ఉంటారు.



కేర్‌ఫ్రీ మాత్రమే నేప్‌కిన్ లోపలి పొరలలోనికి చెమ్మను ఏకరీతిగా చేరేలా చేసే, ప్రత్యేకమైన పీల్చే గుణముగల పదార్థముతో తయారుచేయబడినది. అందువలన ఒకేచోట తడిసి పాడవదు.

నేప్‌కిన్ అడుగు భాగమంతా మరియు రెండు వైపులా చుట్టివున్న నీలి అంచు కారణముగా మరక పడుతుందను బాధ ఉండదు.

కేర్‌ఫ్రీ వాడుకలో ఎంతో వీలైనది. ఎందుకంటె, దానిని ఉపయోగించిన తరువాత సులభముగా 'ఫ్లష్' చేయవచ్చును కనుక మీరు బయట తిరుగునపుడు లేక ప్రయాణములో చికాకు పడరు.

కేర్‌ఫ్రీ మీ దేహమునకు సౌఖ్యముగా, సరిపోయేలా మార్చుకోగలిగే సైజులలో లభిస్తోంది. ప్రతి ప్యాకులోను ఉచితముగా యివ్వబడే కేర్‌ఫ్రీ బెల్టు పెట్టబడింది.

**అమ్మయ్య! మీరు నెలలో 30 పూర్తి రోజులు హాయిగా ఉండగలరు!**

ఇంకా, ఎక్కువ మంచి వస్తువులు కావాలనే స్త్రీలకు క్రొత్త, మేలు రకపు మార్చుకోగలిగే బెల్టు విడిగా అమ్మబడుతోంది. దానిని కేర్‌ఫ్రీ సానిటరీ నేప్‌కిన్‌లను అమ్మే షాపులలో చూడండి




జాన్సన్ & జాన్సన్ • స్త్రీలకు హాయియైన రక్షణకు

మా అమ్మమ్మే. నడుంకట్టి, గడ్డపలుగుతో దొడ్డంతా త్రవ్వుతూ కన్పించింది. నన్ను నిర్లక్ష్యంగా ఒకసారి చూసి తన పని తాను చేసుకుపోతోంది.

## అమ్మమ్మ కాశీయాత్ర

నాకు ఒళ్లు మండిపోయింది. ఆ పలుగు పెట్టి ఆవిడ బుఱ్ఱమీద రాంకీర్తన పాడిద్దా



మనుకున్నాను,

ఆ పని చెయ్యలేక నా కోప మంతా ఏడుపుగా మారిపోయింది. ఏడ్చాను వయసు కూడా మర్చిపోయి. నా కళ్లలోంచి నీళ్లు కారిపోతున్నాయి. ఏడ్చి, ఏడ్చి నా కళ్లు ఎఱ్ఱగులాబీలుగా మారి వుంటాయి కూడా.

నా ఎక్కిళ్లు విని మా అమ్మ వచ్చింది.

"చూశావే అమ్మా! నా మొక్కల్ని అమ్మమ్మ పీకిపారేసింది." అన్నాను ఏడుస్తూనే.

"ఏమిటె అమ్మా!" అంది మా అమ్మ వాళ్ల అమ్మతో.

"ఎందుకే ఆ పాడు మొక్కలు. పూలు పెట్టుకుంటే కడుపు నిండుతుందా? అందుకే పీకిపారేశాను. కూరగాయ మొక్కలు వేస్తున్నాలే..." అంది అమ్మమ్మ పెడసరంగా.

మా అమ్మ మాట్లాడలేదు. "పోనీ లేవే. పూలు కావాలంటే శాంతమ్మగారు ఇవ్వరూ!" అని నన్ను ఓదార్చింది.

అప్పట్నుంచి అమ్మమ్మకి నాకు అసలు పడ్డంలేదు. ఆవిడ మాటంటే లెక్కలేకుండా తిరగ సాగాను. నా కోసం తెలుసుకుని ఆవిడ కూడా రెచ్చకొట్టకుండా తగ్గి వూరుకుంది.

ఏ మాటకి ఆ మాటే చెప్పుకోవాలి. మా అమ్మ కూరగాయల తోట అద్భుతంగా పెంచింది. ఎరువు తెప్పించి పాదుల్లో వేయించింది. పొట్ల పాదులకి తీగలు వచ్చే సరికి పందిరి వేసింది. చిక్కుడు, పొర, బీర మొక్కల్ని దాని మీదికి ప్రాకించింది. బెండ మొక్కలు క్రొత్త పెళ్లి కూతుళ్లలా నిగ, నిగ లాడుతూ వచ్చాయి. గోంగూర పచ్చగా నిండుగా మొలిచింది. టమాటో, వంగనారు, ఏపుగా పెరగసాగింది. తోటకూర మొలకల్ని పిచ్చికలు తినకుండా వలలు కూడా తోటలోనే మకాం పెట్టింది. ఇంకో నెలకి కూరగాయలు కొనే ఖర్చు తప్పిపోతుందిలే అని సంతోషించారు అమ్మా నాన్న.

ఆ తోట చూసుకుని అమ్మమ్మ గర్వంతో పొంగిపోయేది. "కష్టేఫలే అన్నారే పెద్దాళ్లు. అందం కోసం పూల మొక్కలు పెంచితే ఏమొస్తుందే నా మొఖం. తల్లో 'పెట్టుకుంటే తెల్లారికి వాడిపోయి వుంటాయ్. కూరలు పెంచితే కడుపు నిండుతుంది నాలుగు డబ్బులు మిగుల్తాయి ..." అని శాంతమ్మగార్ని దెప్పుతూ వుండేది.

అటు శాంతమ్మగారి పూలతోట, ఇటు

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777

**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**






సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది!
ఇది క్రొత్త ఫార్ములా. దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా, ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

ఈ క్రొత్త రకపు ఉతికే బార్‌ను వాడడము ప్రారంభించండి—సూపర్ 777 డెటర్జెంట్ ఉతికే బార్!

shilpi hpma 6A/73 TEL

ధర్మపథం * **కలిపాపాలు పోయేదెట్లు?** * తులుసు వేంకటరమణయ్య

"కలి" అనగానే కలియుగమే వెంటనే స్ఫురణకు వస్తుంది. కాని, కలి శబ్దానికి జగడము, యుద్ధము అనే అర్థాలుకూడా ఉన్నవి. ఈ కలికాలంలో జగడాలూ, యుద్ధాలూ అధికంగా ఉన్నందున, యుగానికి కూడా ఆ పేరు వచ్చినదేమో!

అధర్మం ఎక్కువ కావడం వల్లనే కలహాలూ, యుద్ధాలూ సంభవిస్తున్నవని అందరూ అంటారు. కృతయుగంలో నాలుగు పాదాలు ధర్మం ఉండినదనీ, త్రేతాయుగంలో ధర్మం మూడు పాదాలు, అధర్మం ఒక పాదం ఉండినదనీ, ద్వాపరయుగంలో ధర్మాధర్మాలు చెరిసగం ఉండినవనీ, కలియుగంలో ధర్మం ఒక్కపాదం, అధర్మం మూడుపాదాలు ఉన్న దనీ గ్రంధాలవల్ల తెలుస్తున్నది. అధర్మం అధికంగా ఉన్నందువల్ల పాపాలు వృద్ధిపొంది, జనులు మిక్కిలి బాధపడవలసి వస్తున్నది.

ఈ పాపాలను నశింపజేస్తే జనులు సుఖపడగలరు. అన్యాయాలవల్ల పాపం పెరుగుతుంది. వాటిని నశింపజేయడ మెలాగ? హిత బోధవల్ల పనులు జరగడం సాధ్యంకాదని అందరికీ తెలుసు.

కలియుగంలో పాపాలు పోగొట్టుకొవడానికి ఒకే ఒక మార్గం ఉన్నది. అది హరినామ సంకీర్తనం!

ఈ విషయాన్ని గురించిన శ్లోకం ఒకటి ఉన్నది —

"శమాయాలం జలం వహ్నేః
తమసో భాస్కరోదయః,
శాంత్యై కలౌ హ్యఘౌఘస్య
నామసంకీర్తనం హరేః."

కొంపలు అంటుకుని అగ్ని నలువైపులా వ్యాపించినప్పుడు ఆ మంటలను చల్లార్చడానికి నీరు ఉంటే చాలును. ఆ విధంగానే గాఢంగా కమ్ముకున్న చీకట్లు నశించడానికి సూర్యోదయ మయితే చాలును...అల్లే కలియుగంలో పాప సమూహాలన్నీ పటాపంచలు కావాలంటే భగవన్నామమును సంకీర్తన చెయ్యవలసి ఉంటుంది. దానివల్ల ఆ పాపాలు తప్పక నశిస్తాయి. అంతకంటే మరొక మార్గం లేదు. హరినామ సంకీర్తనకంటె, మనం చెయ్యగలిగినదీ లేదు ... అని దీని భావం.

ఈ యుగంలోని మానవులు వెనుకటి యుగాలవారికన్న దుర్బలులై ఉండడంవల్ల అట్టివారి సౌకర్యార్థం వారి వారి పాపాలు పోగొట్టుకొనడానికి సులభోపాయమైన ఈ నామ సంకీర్తన ఏర్పడినట్లు మనం గ్రహించవలసి ఉన్నది.

## అమ్మమ్మ కాశీయాత్ర

మా అమ్మమ్మ కూరగాయల తోటా, పోటా పోటీలమీద పెరుగుతున్నాయి.

ఒకరోజు ఉదయం నేనింకా కళ్ళు విప్పలేదు. మా అమ్మమ్మ కేకలు విని ఉలిక్కిపడి లేచాను.

ఏం జరిగిందోనని అమ్మా, నాన్న తోటలోకి పరుగెత్తారు. నేనూ వెళ్ళాను.

ఏముంది? ఎలుకలు తోటమీద దండయాత్ర చేసిన చిహ్నాలు కనిపించాయి. బెండ మొక్కలు సగంవరకూ పీకిపారేశాయి. పొట్ల పాదుల్ని మొదళ్ళలోనే కత్తిరించేశాయి వంగ, టమోటా నారు చిందర వందరగా వుంది.

అమ్మమ్మ ఏడుపు మొఖం పెట్టివుంది. నాకు మాత్రం భలే సంతోషం వేసింది. ఎగిరి గంతులు వేద్దామనుకున్నాను. కాని ఆ కోపంలో నావీపు చీరేస్తుందో ఏమోనని మౌనం వహించాను.

ఆ సాయంకాలం అనుకుంటాను. అమ్మమ్మ కాస్త కుదుట పడ్డాక "పూలు పూసే నాగులాటీ మొక్కల్ని పీకేసిందే! ఇప్పుడు తను పెంచిన కూర మొక్కల్ని పీకమని దేవుడే ఎలకల్ని పంపించాడు. దేవుడు లేడూ?" అన్నాను మా అమ్మతో. ఈ మాటలు మా అమ్మమ్మకి వినబడాలని నా వుద్దేశ్యం. విన్నది కూడాను.

నా అమ్మ నవ్వుకుని "ష్!... వూరికే వాగకు..." అని నన్ను మందలించింది.

నా మాటలు విని అమ్మమ్మ వూరుకుందంటే, ఏదో తీవ్రాలోచనలో వుందన్నమాటే. మా అమ్మమ్మ బుర్రను వుపయోగించాలేగాని పాదరసంలా పన్చేస్తుంది. సందేహం లేదు.

ఆ రాత్రి అమ్మమ్మ లాంతరు వెలిగించుకొని దొడ్లో ఏదో చేస్తోంది. మా అమ్మను అడిగాను.

"ఎలకల మందు తెచ్చి అన్నంలో కలిపి పెడుతోంది. ఎలకలు తిని చచ్చి వూరుకుంటాయి" అన్నది అమ్మ.

"మరి అవి దొడ్లోతిని, ఇంట్లోవచ్చి ఏకలుగులోనో చస్తే పాడు వాసన కాదుటే!" అన్నాను.

"భరించక తప్పదు..." అంది అమ్మ నవ్వుతూ.

నాకు వికారం వేసింది. అవి ఇంట్లోచస్తే ఆవాసన భరించటం ఎలా? అన్నం ఎలా సహిస్తుంది? ఎలా చదువుకోవాలి? అని దిగులుతోనే నిద్రపోయాను.

నేను నిద్రలేచేసరికి వరండాలో అమ్మమ్మ శోకమూర్తిలా కన్పించింది. మాటా పలుకూ లేదు. జ్వరం గనుక వచ్చిందో ఏమో పాపం అనుకున్నాను.

అమ్మనడిగితే తోటలోకివెళ్ళి చూడమంది ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ.

"ఏం జరిగిందబ్బా!" తోటలోకి వెళ్ళాను.

అక్కడొక తెల్లపిల్లి చచ్చిపడి వుంది.

పిల్లిని చంపిన పాపం ఎలాంటిదో మీకెవరికీ తెలియంది కాదు.

మహారాజులయితే బంగారు పిల్లిని చేయించి సత్‌బ్రాహ్మణోత్తమునికి దానం చేస్తారు.

బంగారు పిల్లిని చేయించే తాహతు లేనివాళ్ళు వెండిపిల్లిని చేయించవచ్చు.

అమ్మమ్మ వెండిపిల్లిని చేయించాలని పట్టు బట్టింది.

మా నాన్న 'అంతా చాదస్తం' పొమ్మన్నాడు.

అంతేకాదు పైసా ఇవ్వనని ఖండితంగా చెప్పేశాడు.

నేనేమో మట్టిపిల్లిని దానం చెయ్యమన్నాను.

అమ్మమ్మకి మా అందరి మీద కోపం వచ్చేసింది.

అవధానికి అర్జంటుగా కబురుచేసి వెయ్యి రూపాయిలూ వసూలు చేసుకుంది.

వెండి పిల్లిని చేయించి శివాలయం పూజారిని పిలిపించి శాస్త్రయుక్తంగా దానం చేసింది.

అప్పట్నుంచి మా అమ్మమ్మ కాశీయాత్ర పథకం పూర్తిగా ఉపసంహరించుకుంది.

నా కోరిక తీరని కోరికే అయిపోయింది.

**కుండపోతగా వర్షం కురుస్తోంది. మధ్య మధ్య ఇళ్ళు, చెట్లు, మనుష్యులు ఎగిరిపోయేట్లుగా ఈదురుగాలులు వీస్తున్నాయి. వంటగది, వరండాకూడా కురుస్తూండడంతో మధ్యగదే వంటగదిగా మారిపోయింది.**




# పాపమొకరిదీ శిక్షఇంకొకరిదీ!

ఎ.బి.వి.నరసింహారావు

గదిలో ఒక వారగా కుక్కిమంచంలో పడుకొని, అప్పుడప్పుడు భయంకరంగా దగ్గుతున్న తండ్రివేపు భయం భయంగా చూస్తోంది సరోజ. సాయంత్రం అయిదైనా కాకుండానే బాగా చీకటి పడిపోయింది. దానికి తోడు గదికి వరండాలోకి వున్న తలుపును, వంటగదిలోకి పోయేతలుపును కూడా మూసి వేయడంతో ఆగది అంతా చీకటితో నిండి పోయింది.

''దీందుంపతెగా ... తుపాను పట్టుకున్నట్టుందే'' కుక్కిమంచంలోని ముసలాయన లతికష్టంమీద ఆమాటలు అని పెద్దగా దగ్గాడు.

''మీరు మాట్లాడకండి, దగ్గు, ఆయాసం వస్తుంది. మాత్రలేవైనా వేసుకోవాలా— వేడినీళ్ళు పెట్టాను ఇమ్మంటారా'' తల్లి కుంపటిదగ్గర కూర్చుని విసురుతూ అంది.

భార్య మాటలకు ముసలాయన వెంటనే జవాబివ్వలేదు.

''మాత్రలెక్కడున్నాయే నిన్న పొద్దుటికే అయిపోయాయి ... అయినా ఆమాత్రలకు ఈరోగం తగ్గుతుందా ? ... మంచి వైద్యం చేయించుకోడానికి అదృష్టం ఉండొద్దూ... ఈఘటం తొందరగా దాటిపోతే బాగుణ్ణు అందరికీ సుఖంగా ఉంటుంది...'' దగ్గులో కలిసిపోయిన తండ్రిమాటలను వినలేక చెవులు గట్టిగా మూసుకొంది సరోజ. ముసలాయన ఖాండ్రించి మంచంకింద ఉమ్మేసి రెండు చేతుల్తో బాధగా గుండె అదిమి పట్టుకొన్నాడు.

''రామ రామ అసురసంధ్యవేళ అవేం మాటలండీ'' తల్లిగొంతు నీరసంగా విన్పించింది సరోజకు.

గుడ్డ ఉయ్యాల్లో పిల్లవాడు కెవ్వున ఏడవడంతో సరోజ గబగబ ఉయ్యాల దగ్గరకు వెళ్లి వాడిని సముదాయించడానికి ఉయ్యాల ఊపసాగింది.

''మధ్యాహ్నం నుంచి జ్వరం కాగిపోతోంది. స్పృహ తప్పినట్లు ఇప్పటిదాకా పడి నిద్ర పోయాడు. ఇక ఇవతలకితీసి వాడికి కాసిని పాలు పట్టరాదూ'' చివరి మాటలు అనే టప్పుడు తల్లి కంఠం వణకటం గమనించింది సరోజ. పోయిన నెల బాకీ ఇవ్వలేదని పాలవాడు పాలు పొయ్యడం మానేసి మూడు రోజులయిందన్న సంగతి ఆ ఇంట్లో ప్రతి ఒక్కరికి బాగా గుర్తుంది. పాలు మానేసే టప్పుడు పాలవాడు చేసిన హంగామా ఆ చుట్టుప్రక్కల వాళ్లందరకి ఇంకా బాగా గుర్తుండే ఉంటుంది. పసికందని దయతలచి పక్కింటివాళ్లే మూడు రోజుల నుంచి కాసిని పాలు ఇస్తున్నారు. వాటిలో ఇన్ని నీళ్లు కలిపి వాడికి ఈ మూడు రోజుల్నించి పట్టోంది తను. మళ్లీ ఈరోజు ఏ మొహం పెట్టుకొని వాళ్ల ఇంటికి వెళ్తుంది తను ?

ఉయ్యాల ఊపుతున్న సరోజ కళ్లల్లో నుంచి నీళ్లు చెంపల మీదుగా ప్రవహించాయి. ఆ క్షణంలో ఆమెకు ఎదురుగా కన్పించిన వారందరిని నమిలి మింగెయ్యాలన్నంత కోపం వచ్చింది. జూదంలో ఆస్తినంతటిని అర్పించి చివరకు కుక్కిమంచంలో అస్థిపంజరంలా మిగిలిన తండ్రి, ఆస్తిపాస్తుల ఆశలు లేక పోయేసరికి అన్ని బంధాలను తెంచుకొని పారిపోయిన అన్నదమ్ములు, పస్తులతో కాలం గడుపుతున్న తల్లి, అత్తగారింటి నుంచి భాగ్యం తీసుకురాలేదని పసికందుతో సహా వెళ్లగొట్టిన భర్త—వీళ్లందరి మీద కోపం ముంచుకొచ్చింది సరోజకు. అందరూ ఉండి కూడా అనాథలా మిగిలిపోయింది తను. రోగిష్టి తండ్రికి, నీరసించిన తల్లికి భుక్తి సంపాదించి పెట్టవలసిన బాధ్యత తనపై పడింది. ఇన్ని కష్టాలలో నలుగుతున్న తనలో ఏమి అందం కన్పించిందో కాని కీచకుని

లాంటి తన బాస్ తనను అనుక్షణం వేధిస్తూంటే నెలరోజుల క్రిందట చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఇంట్లోనే ఉండిపోవలసి వచ్చింది చేతిలోఉన్న జీతం రాళ్లు అయిపోయేలోపల మరో ఉద్యోగం దొరక్కపోయేసరికి పరిస్థితి మరింత భయంకరంగా తయారైంది.





## పాపమొకరిదీ శిక్ష ఇంకొకరిదీ!

ఉయ్యాల్లోని పిల్లవాడు గుక్కపట్టాడు ప్రాణం ఉండబట్టలేక వాడిని ఉయ్యాల్లోంచి ఒళ్లోకితీసుకొంది సరోజ. వాడి ఒళ్లు కాలిపోతోంది. జ్వర భారంతో వాడి కళ్లు బరువుగా మూసుకొని పోతున్నాయి. వాడిని వెంటనే డాక్టరు దగ్గరకు తీసుకువెళ్లి ఏ ఇంజక్షనో ఇప్పించాలి కాని ఏ డాక్టర్ వాడిని చూస్తాడు? ఇంతకాలంగా తండ్రికి మందిస్తున్న డక్టరు మొన్న కాంపొండరు చేత చెప్పించాడు. ఇకమీదట ఫీజు ఇవ్వందే ట్రీట్‌మెంటు జరగదని. గవర్నమెంటు ఆస్పత్రి మందులు తండ్రి రోగాన్ని పెంచాయేకాని తగ్గించలేదు గుక్కపట్టిన పిల్లవాడిని రొమ్ముల కద్దుకొని ఏడుస్తోంది సరోజ. ముసలాయన పెద్దగా దగ్గి, మంచంకింద ఉమ్మేస్తున్నాడు. ముసలావిడ నీరసంతో కళ్లుమూసుకొని పెచ్చులు ఊడిపోతున్న గోడకు జారగిలబడింది. బయట వర్షం ఉధృతం అంతకంతకు హెచ్చుతోంది. గుండెలు అవిసిపోయేలా ఉరుములు ఉరుముతున్నాయి. భవిష్యత్తు అంతా అంధకార బంధురంగా తోచింది సరోజకు ఉద్యోగం ఇంకొకటి తనకు ఎప్పటికి దొరికేటట్లు? తను సంపాదించే దెప్పటికి?? తల్లిదండ్రులను, కన్నబిడ్డను పోషించుకోగలిగే దెప్పటికి??? — సరోజ తల గిర్రున తిరిగింది.

"కలవాళ్ళకుగాని, లేనివాళ్ళకు మనకెందుకే ఈ అభిమానాలు? చూస్తూ చూస్తూ ఆ పిల్ల వెధవను ఎట్లా చంపుతావే-గ్లాసు తీసుకువెళ్ళి పక్కింటి వాళ్ళనడిగి కాసిని పాలు పోయించుకొని రామ్మా" — తల్లి నీరసంగా అంది.

సరోజకు ఆ క్షణంలో తల్లి మాటల్లో ఎన్నో అర్థాలు కన్పించాయి. ఆమె మాటలు ఏదో కర్తవ్యాన్ని బోధిస్తున్నట్లు విన్పించాయి.

'కలవాళ్ళకుగాని, మనకెందుకు అభిమానాలు -' తల్లిమాటలు అన్నిదిక్కుల నుంచి మార్మోగుతున్నాయి.

తండ్రికి మళ్ళీ దగ్గుతెర వచ్చింది.

"ఆ మాత్రలు వేసుకుంటుంటే కాస్త నెమ్మదిగా ఉండేది ఇప్పుడు ఎంతగా ఉంగచుటుకు పోతున్నారో — ఇంతమంది సంతానాన్ని కంటే చివరకు ఒక్కళ్ళూ ఆదుకోలేక పోయారు' తల్లి పారిపోయిన కొడుకుల్నే దృష్టిలో పెట్టుకొని అన్నదో, తననుకూడా కలిపే అన్నదో సరోజకు అర్థంకాలేదు.

ఒడిలో కొడుకునుతీసి తల్లికిచ్చి వంటగదిలోకివెళ్ళి గ్లాసుతీసుకొని వస్తున్న సరోజకు తల్లి సణుగుడు స్పష్టంగా విన్పించింది.

"ఎవరో పోకిరి వెధవలు ఏదో అన్నారని బంగారంలాంటి ఉద్యోగం వదులుకుంటారా? అంతా ఖర్మ. ఇప్పుడు ఎట్లా గడుస్తుంది? ఊరుకోరా నాయనా ఏడవకు. ఒకప్పుడు అడిగినవాళ్లకు, అడగని వాళ్లకు కూడా పెట్టిందాన్ని ఇప్పుడు ఒక్కగానొక్క మనవడికి ఉద్ధరిణెడు పాలు పట్టలేక పోతున్నాను" ...తల్లి మాటలకు సరోజ కళ్లు చీకట్లు కమ్మాయి.

కీచకునిలాంటి బాస్ తనచేతిని పట్టుకొని దగ్గరకు లాక్కొని తనను ముద్దుపెట్టుకోబోయాడని, తాను ఎట్లాగో కేకలుపెట్టి పారిపోయివచ్చానని సిగ్గువిడిచి తల్లితో చెప్పుకొంది. ఇప్పుడు ఆతల్లే అన్నింటికి తలవంచి జీతంరాళ్లు సంపాదించకూడదా అని అంటున్నది. పైకి చెప్పలేక గొణుక్కుంటోంది. ఛీ—ఛీ— ఆకలి, దరిద్రం ఎంతకు దిగజార్చుతున్నాయి?— పమిట చెంగుతో కన్నీళ్లు వత్తుకుంటూ గబగబా పక్కింటికి వెళ్ళింది సరోజ.

ముష్టి దొరికినట్లుగా దొరికిన ఆ కాసిని పాలలో మరికొన్ని నీళ్ళు కలిపి చెంచాతో పిల్లవాడికి పడుతూండగా తండ్రికి మళ్ళీ దగ్గుతెర వచ్చింది.

"నేనింక బతకలేనే- ఈదగ్గుతో ఊపిరాడకుండా ఉంది...ఇదిగో..,నేచస్తే ఈడ్చి ఆరోడ్డుమీద పారెయ్యండి ... మునిసిపాలిటీ వాళ్లే లాక్కుపోతారు ... పిల్లవాడి పాలకే గతిలేని వాళ్ళం..."'

తండ్రి మాటలు శూలాల్లా గుచ్చుకొన్నాయి సరోజకు.

"ఏమిటా మాటలు — ఊరుకోండి"

"పిచ్చిదానా! అంతా చచ్చేముందు ఆస్తిపాస్తుల గురించి చెబుతారే కాని... నేను... నే.. ను చచ్చినాకాని మీకు భారం కాకుండా ఉండే మాటలు చెబుతోంటే..." మాటలు

పూర్తి కాకుండానే ఆయన దగ్గుతో ఉండ చుటుకు పోయాడు

ఈసారి ఆయన ఉమ్మేసినప్పుడు కొంచెం రక్తం పడ్డట్లుగా సరోజకు కన్పించింది. ఆమె నవనాడులూ కృంగిపోయాయి. తండ్రి కళ్ళముందే వైద్య సహాయం లేక మెల్లి మెల్లిగా చచ్చిపోతున్నాడు. ఆయన చావుకు కారణం తనా? సరోజ కళ్ళు జలపాతాలే అయినాయి.

పాలో, సిక్సో—ఏదో ఒకటి కొని పెట్టులో పడేసరికి ఏడుపుమాని నిద్రతో జోగుతున్న కొడుకును పక్క ఉయ్యాల్లో పడుకోబెట్టి, పెట్టెదగ్గరకువెళ్ళి, కొద్దిగా చిరుగులు తక్కువగా ఉన్న రంగు వెలిసిన చీర తీసుకొని వంటింట్లోకి వెళ్ళిపోయింది సరోజ. చీర కట్టుకొని వంటగదిలోనుంచి ఇవతలికి వచ్చే టప్పుడు ఆమె మొహంలో జీవకళ నశించి పోయింది. తుఫానును నిలువరించడానికి వెళ్తున్నట్లుగా, విసురుగా వీధి వాకిలి తలుపులు తీసుకొని బయటకు వెళ్ళి పోయింది ఆమె.

రాత్రి బాగా ప్రొద్దుపోయిన తర్వాత ఇంటికి చేరుకొన్న సరోజ బరువుగా ఉన్న బుట్ట తీసుకొని రిక్షాదిగుతూ పేలవంగా నవ్వుకొంది. చేతిలోనోట్లు తడవకుండా పైట చెరుగును చేతిమీదకు లాక్కుంటూ, చిల్లర రిక్షాఅతనికి ఇచ్చేసి ఇంట్లోకి అడుగు పెట్టిన సరోజ ఎదురుగా కన్పించిన దృశ్యంచూసి కొయ్యబారి పోయింది. ఆమె చేతుల్లోంచి జారిపడిన బుట్టలోంచి పాలడబ్బా, హార్లిక్స్ సీసా నేలమీదదొర్లాయి. నేలమీద ప్రశాంతంగా పడుకొనివున్న తండ్రి తలవైపున వెలుగుతున్న దీపంలో ఆమెకు కీచకుడు కన్పించి వికటాట్టహాసం చేశాడు.

పై వారమే

కొత్త సీరియల్

# ప్రతిపక్షాలకు ఎదురౌతున్న గడ్డు ప్రశ్న

'ఈ పదవి వ్యామోహం ఎక్కడా చూడలేము ... యింత జరిగింది ... కోర్టు అనర్హురాలి వంది — ఆరేళ్ల దాకా 'వోటు' పూసెత్తొద్దంది.. ఛీ ఛీ! మొండి మనిషి ... యింతవరకూ రాజీనామా చేయలేదు...నైతికంగా, ధార్మికంగా, ప్రజాస్వామికంగా, యింకా యింకా అలాగా యిలాగా ఎలాగా చూసినా ఆమె రాజీనామా చేయటం ధర్మం...' నెత్తురంతా మరిగి మొహం లోకి వేడి వచ్చేస్తున్న ఆవేశ వేదనంలో కొంప చేమకున్న ఓ 'పెద్ద మనిషి'ని వాళ్లావిడ "అబ్బబ్బ! అంత గాభరా పడకండి ... అలా కూర్చొని .. యీ కప్పు కాఫీ త్రాగండి — ఆ చెమట తుడ్చుకోండి"-అంటూ 'కూలుదోసి' (కూల్ డౌన్ చేసి అన్నమాట) ఓ రెండు గ్రుక్కలు కాఫీ త్రాగక యిలా అందట! "అవునూ! ఇందిరమ్మ ఎన్నిక చెల్లక పోయిందంటూ కోర్టువారిచ్చిన తీర్పు అమలు కావటానికి యింకా యిరవై రోజులుందిగా...యిప్పుడే ఆవిణ్ని మీరు డిస్క్వాలిఫై చేస్తున్నారెందుకు? — పోనీ అది వొదిలేయండి నాలుగు సంవత్సరాల నలభై రోజులుగా అండ యీ కోర్టువారి తిర్పు ప్రకారం అక్రమంగా, ప్రధానమంత్రిగా వున్నట్లేగా ... అన్నాళ్ల లేని "కొంప లంటుకు పోడం యీ 20 రోజుల్లోను ... కాదా సుప్రీంకోర్టు వారు తీర్పు చెప్పేలోగానూ వచ్చి పడిందంట?" అంటూ నిలదీసేసరికి - మరి నాలుగు నిమిషాలు మారు మాటాడని ఆ పెద్దమనిషి మరో కప్పు కాఫీ పుంటే యిద్దూ — అన్నాట్ట! — ఆస్తాగాని మా యింది రమ్మ మీ మగాళ్లలా పిరికిది కాదు... ఏమైనా రాజీనామా చేయదు" ...' అందటా మహిళా మణి!

కాని జైప్రకాశ్, మొరార్జీ, పాటిల్, మిశ్రా, చాగ్లా, వాజ్‌పేయీలాంటి ప్రజ్ఞా ధురంధరులందరిదీ ఒకే 'గోల' క్రింద జమ కట్టేసింది నెహ్రూగారి కూతురు.

ప్రధానమంత్రి పదవికి నేనా? నువ్వా? అంటూ ముందుకురాగల జగజ్జీవన్‌రామ్, వై. వి. చవాన్‌లాంటి అతిరథ మహారథులంతా పార్టీ అధినేత బారువాతో కలిసి "శ్రీమతి గాంధీయే శ్రీమతి గాంధీయే" తప్ప వేరే ప్రధాని యీ దేశానికి కర్లేదన్న అర్థంతో పత్రాలురాసి నిశానీలు పెట్టేశారు.

రాష్ట్రపతి ఫక్రుద్దీన్‌గారు కాశ్మీర్‌లో వున్నారు. అర్జంట్‌గా ఆయన రానక్కర లేదన్న అభిప్రాయం లీగల్ పండిట్స్‌ని సంప్రదించి మరీ 'ఇందిరమ్మ' ఆయనకు పంపించింది.

## రాజీనామా చేయాలా? వద్దా?

'చేసేయాలి' ... "చేసి తీరాలి" అంటూ ప్రతిపక్షాలన్నీ ఒక్కటే గొంతుతో అరిచాయి! [సి. పి. ఐ. (కుడి) తప్ప] ఖాళీగావున్న రాష్ట్రపతి యింటి ముందు పీలూ మోడీ లాంటి

(5వ పేజీ తరువాయి)

స్వామినాయుడు మొదలు ఎల్. ఎన్. మిశ్రా దాకా అంతా ధర్నా చేశారు! అర్జంట్‌గా ఏడు సూత్రాల కార్యక్రమం కూడా రూపొందించుకుని దేశం మీదకు కదిలారు. పనిలో దీనికి 'ప్రతి'గా కాంగ్రెసువారు 'లారం గోలీ ఖాయెంగే ... లేకిన్ తుమ్‌కో బచా యేంగే...' అంటే "లాఠీలు తుపాకీగుళ్లు పెట్టి మమ్మల్ని కొట్టినా (ఎవరు కొడతారు? ప్రతిపక్షాల దగ్గర అవెక్కడున్నాయి? నోళ్లు తప్ప) సరే మేం మిమ్మల్ని రక్షించుకుంటాం" అంటూ ప్రధానమంత్రిగా శ్రీమతి గాంధీయే కావాలన్న ప్రదర్శనలు చేశారు. కాంగ్రెసు ముఖ్య మంత్రులు, రాష్ట్ర నాయకులు తీర్మానాలు ప్రారంభించారు!

ఈ గందరగోళంలో —"ఇంతకీ సుప్రీం కోర్టులోనో పార్లమెంటులోనో తేలాల్సిన యీ వ్యవహారాన్ని యిలా రోడ్డుమీదకి లాగే కారేం చెప్మా" అంటూ ఎవరైనా పవిత్ర భారతీయ పౌరుడు విశ్లేషిస్తే గమనించే దెవరు?

## ఇంతకీ ఆమె చేసిన అపరాధాలు ఏమిటి?

ఏడు రకాల అక్రమాలకు ఆమె పాల్పడ్డట్టు కోర్టు ఎదుట— శ్రీమతి గాంధీతో సహా వందలాది సాక్ష్యుల ఆధారంతో—విచారణ జరిగింది ఆరోపణలు క్లుప్తంగా యిలా వున్నాయి. (1) ప్రధానమంత్రి సచివాలయంలో డ్యూటీ ఆఫీసర్ అయిన యశ్‌పాల్ కపూర్ అనే గెజిటెడ్ ఉద్యోగిని ఎన్నికలకు వినియోగించారు. (దీని విషయంలో కోర్టు వారు ఆమెను 'దోషి'గా నిర్ణయించారు.)

(2) ప్రధాని ఆదేశంపై శ్రీ యశ్‌పాల్ సందేశంపై యు. పి. గవర్నమెంట్ పోలీసు అధికారులు మున్సుగువారు ప్రధాని ఎన్నికల ప్రచారానికి ఏర్పాట్లు చేయటం జరిగిందని, అది ప్రజా ప్రతినిధుల చట్టం క్రింద నేరమని కూడా కోర్టు తీర్పుయిచ్చింది. కాగా తతిమ్మా ఐదు అభియోగాలను కొట్టివేసింది.

వాటిలో ఆమె ప్రయాణాలకు ఇండియన్ ఏర్‌ఫోర్స్ విమానాలు వాడారన్నది కదానం. వోటర్లకు ధోవతులు, రగ్గులు, 'సారా' లాంటి వివ్వారవృది మరొక అభియోగం. వోటర్లను ఉచితంగా అద్దెకు తీసుకున్న కార్లలో, బస్సులలో పోలింగ్ 'బూతు'లకు తీసుకుపోటం జరిగిందన్నది మరో పిర్యాదు. పోతే ఆవు దూడా గుర్తు వాడటం, ఎన్నికల్లో ఖర్చు నిర్ణయించిన పరిమితి దాటడం వంటివి వున్నాయి. వీటిని న్యాయమూర్తి కొట్టివేశారు.

ఏది ఏమైతేనేం హైకోర్టువారు పేర్కొన్న 'నేరాలు' చిన్నవి కావచ్చు. "టూ టెక్నికల్" కావొచ్చు కాని 'ఎన్నిక' రద్దయింది. కనుక ఈ విధంగా ఎన్నిక కోల్పోయిన అభ్యర్థి ఆరేళ్ళు బహిష్కరణకు గురి అవడం ప్రజా ప్రతినిధుల చట్టం 11. ఏ. నిబంధన ప్రకారం తప్పదు. కాని అదే చట్టంలో 11. బి. కూడా వుందిట!

## సుప్రీం కోర్టు కూడా ఈ తీర్పే చెప్పినా?...

హైకోర్టు ఒక అభ్యర్థి ఎన్నికను ప్రజా ప్రతినిధుల చట్టం క్రింద కొట్టివేస్తే ఆతనికి సుప్రీంకోర్టుకు అప్పీలు చేసుకొనే హక్కు వుంది ... అక్కడా యిదే తీర్పు వస్తే ...

## పుస్తకాలు

మూడు పుస్తకాలు
(పద్య కావ్యాలు)

భక్త శబరి (భక్తశబరి, సీతా స్వయంవరం ఖండ కావ్యములు). 22 పేజీలు, వెల తెలియదు.
నివేదన 38 పేజీలు, వెల తెలియదు.
సువ జ : 28 పేజీలు, వెల తెలియదు.
ఈ మూడు భక్తి కావ్యాల రచయిత శ్రీ పేశా సుధాకరరావు, చిరునామా : మేకావారి వీధి, పిఠాపురం, (తూ. గో. జిల్లా.)

సయాగరా

శ్రీయుతులు రామదాస్, ఆంజనేయులు సుబ్రహ్మణ్యంగార్లు రాసిన అభ్యుదయ కవితా యుగంలో అచ్చయిన తొలి కావ్యం ద్వితీయ ముద్రణ. 72 పేజీలు, వెల 4 రూపాయలు.. ప్రతులకు ప్రీవర్స్ ఫ్రంట్, ఎం. ఎస్ 19, విజయ్‌నగర్‌కాలనీ, హైదరాబాద్—500036. ★

"ఎన్నికల కమిషన్"కు మొర పెట్టుకో వచ్చును...ఎన్నికల కమిషన్ కావాలనుకుంటే అభ్యర్థికి ఏర్పడ్డ "అనర్హతల" కళంకాన్ని తొలగించవచ్చును! అంటే ... శ్రీమతి యిందిరా గాంధీ పదవి నుంచి వైదొలగాలన్న వారి వాదం ఎంత "నైతికం" "రాజనైతికం" అయిందో — 'పిల్లేదు వుండాలన్న' వారి వాదం కూడా అంత 'ధార్మికం', అన్న మాటని తటస్థులయిన వాళ్ళు గ్రహించే అవకాశాలున్నాయి. పోతే ఒకమహిళామణి అన్నట్లు "అందరూ ఉను కున్నట్లు నిర్ణయాలు తీసుకుంటే శ్రీమతి యిందిర ప్రత్యేకత ఏముంటుంది ?"

'సంజీవరెడ్డి నామినేషన్ నాడు ఆమె అంతరాత్మ ఏమన్నది ? — కాంగ్రెసు రెండు ముక్కలైనప్పుడు—ఆమెను బహిష్కరిస్తున్నామని పార్టీ అన్న నాడు—ఆమె ఏం చేసింది ? —అదే అంతరాత్మ ప్రబోధం ఆమె ప్రజలకు ఢిల్లీలో జూన్ 13న చెప్పినట్లు "ఈ దేశంలో స్వామ్యవాద తరహా ప్రజాస్వామ్యం స్థాపనకై ప్రజాసేవకై ప్రజల 'మాట'మీద ప్రభుత్వ రథం మీదే వుండి, గుర్రాల్ని అదిలించేటందుకు ప్రబోధిస్తూండవచ్చును. ఆ 'రథాన్ని' అడ్డుకోడం ఎలాగా ? అన్నదే [జూలై మొదటివారం దాకానైనా] ప్రతి పక్షాలకు ఎదురవుతున్న గడ్డు ప్రశ్నకూడా!

ఏది ఏమైనా అలహాబాద్ హైకోర్టు తీర్పు చరిత్రాత్మకం!

# సామాన్యుని సణుగుడు

"ఆబి తెరిశినా శేరు బియ్యం పావల వరకా కంట్రోలు బియ్యం లేకపోతే కడుపులో మంట" భారతదేశానికి స్వతంత్రం రాక ముందు—రేషన్ కార్డు మీద గుర్రాలు కూడా తినని బియ్యం తెచ్చుకున్న జనం — 'కిస్మత్' హిందీ బైస్కోపు పాట బాణీలో కట్టిన యీ చరణం పాడుకుంటూ రోడ్లమీద పోతూండే వారు. శేరు 'పావలాపరకా' అంటే గుండె బాదుకు చచ్చారన్నమాట ముప్పయ్యేళ్ళ క్రితం దేశంలో ప్రజాస్వామ్యం లేని పాడు కాలంలో అలా వుండేది పాడు రాజ్యం — మరి యిప్పుడు అలాంటిదేంలేదు పావలా లున్నాయి. 'పర ' లెత్తేశారు పున్న పావలాకి పాత 'దమ్మిడీ'ల విలువుందని — యింతటి ప్రగతి మనం సాధించామని మురిసి పోవాల్సిందే! మన దృక్పథం ఇలా అంతర్జాతీయం చేసే శారు మన గవర్నమెంటు వారు.

బొత్తిగా అణాలు, బేడలు — శేర్లు సంచాలు లాంటి అనాగరికపు నాణాలు కొలతలు బాగుండవని మనం "విశ్వమానవ దృక్పథాన్ని" అందిపుచ్చుకోవాలని రూపాయలు కొల్తలు, నాణాలు మార్చిపారేశారు. రైల్లో థర్డ్‌క్లాసు మీద ఓ గీత చెరిపేసి సెకండు క్లాసు చేసేశారు! ఇది కొంత నయం — ఫస్ట్‌క్లాసు రేటును సెకండుక్లాస్ రేటుకి పెంచారు కదా! అలాంటప్పుడు క్లాసుని కూడా మార్చాలి మరి.

కాని రూపాయణా పైసల వ్యవహారం తీసేసి పదహారణాల భారతీయుల్ని నూరు పైసల సెక్యులర్ యిండియన్స్‌గా చేసిపారే శారు నయాపైసల తీసేసి కొత్తగా ఐదు పైసల బిళ్ళలు చేసి ముష్టి వేయటానికి మాత్రం వాటి నుపయోగించమని అన్యాయ దేశంగా వాటిని సర్క్యులేషన్‌లో వుంచారు దేశంలో చిల్లర దొరకకుండా ఏలినవారు చేయటంవల్ల ప్రజలు చిల్లరకి బదులు రూపాయిలు పారేసి వస్తువులు కొనుక్కునే స్టేటస్‌కి వెళ్ళిపోయారు అరణాలు సలబై పైసలయితే పావలాలు ముప్ఫయి పైసలయి నాయి. ముప్పావాలాలు రూపాయిలైపోయాయి చెలామణీలో! అలా ప్రగతి సాధించి అంత ర్జాతీయ స్థాయి మనకి తీసుకొచ్చి దశాంక శతాంశ పద్ధతిని మనకి ప్రసాదించి లెక్కలు సుళువుగా కట్టడం నేర్పిన ప్రభుత్వంవారు కొలతలు తూనికలలో రెవల్యూషన్ తీసు కొచ్చేశారు పోని బియ్యం పప్పులు అవీ లీటర్ లలోనైనా పెట్టారా? ... ఎందుకు పెట్టకూడదూ ? ... కిలో బియ్యం ఒక్కో రకం ఒక్కో విధంగా తూగుతాయి. ఒక్కో కొట్లో కిలోకి 800 గ్రాములే కాటా పలుకుతే మరోకొట్లో మరోరకం పాతిక కిలోల బియ్యం కొనుక్కునే మామూలు మనిషికి కనీసం ఓ వంద గాములు కష్టం తప్పదు. కాటాలు తూకంరాళ్ళు గ్యారంటీ కాని రూపాయి వెయ్యి సురు, హం లాభనం యిన్నీ మన భారతీయ ప్రత్యేకతలు కదా! ఆ విధంగా యీ "వసుధారోకతా ప్రపంచంలో దశాంశ విధానాన్ని అనుసరించే ఘనత పొందిన సామాన్యుడికి - బియ్యం పప్పులు పంచదార అన్నీ రూపాయికి 90 పైసలే దక్కుతున్నాయి ... లీటర్లలో కొల్చుకుంటే కొంత నయం కదూ! షావుకారెంత చింతపండు అలికించినా వేలుపెట్టి కొలిచినా పోయేది చారెడు గింజలే కాని వందల గ్రాములు కాదుగా ... 'కిలోల బదులు లీటర్లైనా చేయండి పాత శేర్ల జాగాలో, అని సామాన్యుల విప్లవం ఎందుకు చెయ్యకూడదూ? కాని విప్లవం చేసేది సామాన్యులు కారే! వాళ్ళకా హక్కు బ్యాంగురోమా లేదు వాళ్ళ పుట్టుకలోనూ లేదు...అందుచేత [ వీ ] )




నాకు రావలసిన బాకీ తీర్చేదాకా నీ షర్ట్ విడువను.

షర్ట్ కావాలంటే తీసుకో! నేనేమీ బాధపడను.

# ఫాలాక్షుని డైరీ

## శృతిమించిన పాటలు వింటే చెవుడు!

"హా హ్హావావ్హైహై" అనే బాణీలో పులోమని ఎలుగెత్తి కంఠం విరిగేలాగ పాడేపాటలు వినేవారు కొన్నాళ్ళలో చెవిటి వార్తై పోతారని బ్రిటిష్ మెడికల్ ఇన్వెస్టిగేషన్ తరఫున డాక్టర్ యఫ్. డబ్ల్యు. పీర్సేగారన్నారట. అనేక రకాల శబ్దాలు, అరుపులు ఎక్కువ శృతిలో వినడం వల్ల శ్రోతల చెవులు శాశ్వతంగాతమ వినేశక్తి నిపోగొట్టుకుంటాయని ప్రయోగపూర్వకంగా తెలిసి నిశ్చయమైన విషయమని చాలా చెవి లోపలి భాగాలు దెబ్బతింటాయని, ఇవి గమ్మున కనుక్కోడం బాగుచెయ్యడం కూడా కష్టమని ఆయనన్నారట.

## ఎవరి పర్సు?

మదరాసు గోపతి నారాయణచెట్టి రోడ్డు మీద దొరికిన అయిదువేల రూపాయలున్న పర్సు గత రెండ్నెల్లుగా పోలీసువద్దనే వున్నదట. దాని సొంతదారెవరూ రాలేదట. దిక్కు లేక పడున్న ఆ పర్సు నాథుడెవరో తేల్లేదింకా అని పోలీసు కమీషనరుగారు తెలియజేశారట.

## సినిమాకోసం!

నటుడు ఎం. జి. రామచంద్రన్ నటించిన నినైత్తదై ముడిప్పవన్ (అనుకున్నది పూర్తి చేస్తాను) అనే సినిమా మధురలో విడుదలయిన రోజే చూసే తాపత్రయంలో ఉన్న వో గుంపు ధాటికి తట్టుకోలేక 27 ఏళ్ళ శల్వరాజు అనే లతను క్రిందపడిపోతే, అతన్నాగుంపు మట్టేసిందట. ఫలితంగా అతను చనిపోయాడట.

## బందిపోట్ల వధ

ధన్‌బాద్‌కు 16 కిలోమీటర్ల దూరంలో ఉన్న 'సిల్కురా కాలరీస్' మీద వో నలుగురు బందిపోట్లు విరుచుకుపడి, ఆ కాలరీ ఆఫీసునుంచి 35 వేల రూపాయలు తస్కరించి పారిపోయారట. ఆ కాలరీస్ పని వారంతా చేరి వో పథకం వేసి, ఆ ప్రకారము ఆ నలుగురు బందిపోట్లనూ చుట్టుముట్టేసరికో బందిపోటు తుపాకితో వో పనివాడిని కాల్చి చంపేశాడట. పనివారంతా మూకుమ్మడిగా వారిమీద పడేసరికో బందిపోటూ డబ్బుతో పారిపోయాడట. మిగిలిన ముగ్గుర్నీ పనివారు చావబాది, చంపివేశారట. చంపరూ మరి!

## భయంకర క్షామం.

కలహండి జిల్లాకు చెందిన నవపాదా ప్రాంతమంతా కరువుతో భయంకరంగా, హృదయ విదారకంగా తయారయ్యిందట. తలిదండ్రులు వయస్సులో వున్న తమ ఆడపిల్లలను పది పది హేను రూపాయలకు అమ్మేసు న్నారట. సవేరా అనే ఆమెను ఆమె తండ్రి నలభై రూపాయలకు అమ్మితే అంత రేటే అని అంతా ఆశ్చర్యపోయారట. బూధన్‌ఫారియా అనే లతను తనకూతుర్ని అమ్మాలని చేస్తున్న ప్రయత్నానికిఆ అమ్మాయే గాక, ఆమె తల్లి కూడా వ్యతిరేకిస్తున్నారట. ఎంతైనా మీతో వాలు ప్రదానికి ఆమెను అమ్మి తీరాలని ఆయనన్నాడట. కార్తిక్ అనే ఆవిడ భర్త, ఇద్దరు పిల్లలు ఆకలి బాధతో పోట్లాడి వోడి పోయి, చనిపోయారట. కోతులు, ఆవులు, ఎద్దులు, దున్నపోతులు, నక్కలు, ఏ జంతువుకనపిస్తే దాన్ని చంపి, అక్కడివారు ఆకలి బాధను అణుచుకుంటున్నారట. చన బేధ అనే ప్రాంతంలోని మగవారంతా ఆకలి బాధలో పొట్టాడలేక,ఆ ప్రాంతాదిలిపెట్టివెళ్లిపోయారట.

ఆ ప్రాంతాలలో వాలు కురిసే మూడేళ్ళయిందట. బంగారం తులం రెండొందల రూపాయలకు, వెండి రెండ్రూపాయలకు, చొప్పున అమ్ముకు తిని బ్రతుకుతున్నారట. అక్కడివారు. ఆకలి బాధకు తట్టుకోలేకదానికోసం వయస్సులో వున్న (లేనివారుకూడా) వారుతమ శీలాన్ని చౌకగా, కారు చౌకగా బేరం పెడుతున్నారట. ఆ ప్రాంత రక్షణకు ప్రభుత్వంచేసిన, చేస్తున్న సహాయం ఆవగింజపాటికూడా లేదట. అయితే మొత్తానికుంది కదా!

## హైదరాబాద్ నోట్‌బుక్

(6 వ పేజీ తరువాయి)

ఏదో—బహుశా మృత్యువేమో—తరుముకొని వస్తున్నట్టు ఓవర్‌టేక్ చేయడానికి యత్నించడం, పీకలవరకు తాగి స్టీరింగు పట్టుకొని, తనే చక్రపాణి అనుకోడం, రవాణా నిబంధనలను సరకు చేయక పోవడం ప్రధానంగా ప్రమాదాలకు కారణాలు. మితపానం తప్పుకాదంటారు పెద్దలు. దేహాయాసోపశమనమునకు మితపానం మించిన మందులేదు, కాని ఒళ్ళు తెలియక తాగి వాహనాలునడిపితే గమ్యం ఏమిటో చెప్పనక్కర లేదు. ఈ రవాణా నిబంధనలను కొంచెమైనా పాటిస్తే చాలు, ప్రమాదాలు సగానికిపైగా తగ్గిపోతాయి. రవాణా మంత్రి, పోలీసు అధికారులు ఈ విషయంలో శ్రద్ధ చూపితే చాలు.

**వైశ్యులకు శ్రీ వెంగళరావు సలహా :**

ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు జూన్ 9 న వైశ్య విద్యార్థి వసతి గృహంలో జరిగిన వైశ్యుల సమావేశాన్ని ప్రారంభిస్తూ, చెప్పిన సలహాలను వైశ్యులు పాటించడం అవసరం. ఇది వాణిజ్య పరిశ్రమల యుగం. వాణిజ్య రంగంలో దేశం అభివృద్ధి చెందితేనే అన్ని రంగాలలోను శ్రేయస్సు సాధ్యం. ఆంగ్లేయులు మొదట వ్యాపారముగా మన దేశానికివచ్చి, దేశంలో వ్యాపారసాధారాలు చిక్కబట్టి: క్రమంగా రాజ్యపాలకులు, దేశపాలకులు కావడం మనం విస్మరింపరాదు. వైశ్యులు సహస్రాబ్దాలుగా ధర్మకృత్యాలకు, సంస్కృతి రక్షణకు పేరుపొందినవారు. అనాథపిండదుని వంటివణిక్పుంగవుడు పెట్టనికోటగా నిలవకపోతే తథాగతుడు నిశ్చితంగా ఉపదేశామృతాన్ని ప్రజలకు పంచేవాడు కాడేమోనని నా అనుమానం.

మంత్రి శ్రీ సాగి సూర్యనారాయణరాజు "మీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాల చారిటీస్ కార్యక్రమాన్ని ఇతర దేవాలయాలకూ పొడిగించండి" అన్న సలహాకూడా వైశ్యులు పరిశీలించాలి. ఈ సమావేశానికి శాసన మండలి సభ్యులు శ్రీ కె. రోశయ్య అధ్యక్షత వహించారు.

**ఉపశ్రుతి :**

"ఏం సార్ ! ఇప్పుడు జీతాలు పెరిగాయి గదా ! ప్రభుత్వ యంత్రాంగం సమర్థత ఇక పెరగక తప్పదు" అన్నాను ఒక అధికారితో. "బాగా చెప్పారు. జీతాలు పెంచడం ధరలు పెరగడంవల్ల. సమర్థత పెంచడానికా ?" అని నన్నే ప్రశ్నించాడు.

(30—5—75) వార పత్రిక ఎంతో ఆక ర్షణీయంగా వుంది. ''మంచిని పెంచి చూడు.'' ''పిచ్చివాడి కల'' ''కాలేజి జీవితం'' కథలు చాలా బాగున్నాయి. ''మంచిని పెంచి చూడు'' కథ



## ఉత్తరాలు

( 5వ పేజీ తరువాయి )

మంచి సస్పెన్సుతో కూడి వచ్చే వారం కోసం యెదురు చూడాల్సి వస్తున్నది—

కేవలం డబ్బు ఖర్చుపెడుతూ, విలాస జీవితాల్ని గడుపుతూ కాలేజి జీవితాలను వెళ్లబుచ్చే కొంతమంది విలాస పురుషులైన అక్షాధికారులకు 'కాలేజి జీవితం' కథ ఎంతో గుణపాఠాన్నివ్వగలదని ఆశిస్తున్నాను.

మేళ్లచెర్వు లక్ష్మీ నరసింహప్రసాద్
పాతూరు, (నరసరావుపేట)

* * *

6—6—75 నాటి పత్రిక ''శుభ'' ముఖ చిత్రంతో ఎంతో ఆకర్షణీయంగా ఉంది.

''మంచిని పెంచిచూడు'' కథ చాలా రసవత్తరంగా సాగుతుంది. గుండారపు అప్పారావు (దార్లపూడి.)



ఫిలిం డిస్ట్రిబ్యూటింగ్ సంస్థ లక్ష్మీ కంబైన్స్ అధినేత, ఆంధ్రజ్యోతి డైరెక్టర్లలో ఒకరైన శ్రీ కానూరు జయదేవ్ జూన్ 9వ తేదీ సాయంత్రం మదరాసులో గుండెపోటు వల్ల మరణించారు. ఈయన వయస్సు 40 సంవత్సరాలు. భార్య, ఇద్దరు కుమార్తెలు ఉన్నారు.



సీరియల్

చంద్రకళ ''ముఖచిత్రం''తో వెలువడిన 13—6—75వ తేదీ పత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. అన్నపూర్ణగారి ''ఈ సంఘంలో కుటుంబమే ఇది'' సీరియల్ ఊహించని మలుపులు తిరుగుతుంది. శమంత— హేమంత మార్వెలస్.

ఆర్. జితేంద్రకుమార్, ఆర్. సురేష్‌కుమార్.
(నందిగామ)

* * *

''శమంత— హేమంత'' సీరియల్ కథ సమాజం దృష్ట్యా చాలా వాస్తవికంగా ఉందనే చెప్పాలి మేము సీరియల్ చదువుతున్నంత సేపు ఏదో లోకంలో ఉన్నట్లే ఫీలయ్యాము.

ఎస్. శేషగిరిరావు, ఎన్. గోపికృష్ణ (భీమవరం)

ముఖచిత్రం

తెలుగు నటీలా తెలుగు ఆడపడుచులా పుష్ప యోగితాబాలి ముఖ చిత్రముతో వెలువడిన 30—5—75 తేదీ సంచిక చాలా బాగున్నది.

యస్. విశ్వనాథ్: జి. తిప్పేస్వామి, (గుంటకల్)

* * *

23—5—45, వార పత్రిక యోగితాబాలి ముఖ చిత్రంతో కన్నుల విందుగా మా చేతికి అందినది ''కాలేజి జీవితం'' నేటి యువతరానికి కనువిప్పు కలిగించే విధంగా వున్నది.

కాజ వెంకటప్రసాద్, మూర్తి (  -2)



**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**




రంజిత్ మూవీస్

# చీకటి వెలుగులు

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: కె.ఎస్. ప్రకాశరావు నిర్మాత: కౌనూరి రంజిత్ కుమార్